# జానపద సాహిత్యం

•

డా॥ ఆర్. వి. ఎస్. సుందరం

ప్రచురణ;

రిజిస్టర్డ్ సంఖ్య 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**Jānapada Sahithyam**

a brief review of folk literature by

Dr. R. V. S. SUNDARAM



యువభారతి

ప్రచురణ : **88**

ప్రథమ ముద్రణ :

ప్రతులు : 2,200

ముఖ చిత్రం : శీలావీర్రాజు

ముద్రణ :

సుమన ప్రింటర్స్,

ముషీరాబాద్, హైదరాబాదు-20.

ముఖచిత్ర ముద్రణ :

బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,

చిక్కడపల్లి, హైదరాబాదు.

ప్రతులకు :

యు వ భా ర తి,

5-కింగ్స్‌వే, సికిందరాబాదు - 500 003.

లేదా

యు వ భా ర తి కార్యాలయము

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,

తిలక్ రోడ్, హైదరాబాదు.

వెల : రూ. **4/-**

# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా వున్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సామర్థ్యం చేకూరుతుంది, సమాజంలో సౌందర్యం సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పందొమ్మిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె యితరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో యితోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది ఇంతవరకు 84 ప్రచురణలను ప్రచురించి మూడులక్షల ప్రతులకుపైగా సాధ్యమయినంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభించబడిన సాహితీమిత్ర పథకంలో 8000 మంది సహృదయులుచేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలతో భారతీ మిత్రులుగా 800 మంది భారతీ భూషణలుగా 100 మందిచేరారు.

ఉడతాభక్తితో మేముచేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం యివే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం,

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి.

హైదరాబాదు,
5 డిశంబరు, 1982

సాహిత్యాన్ని సామాన్యులకు సైతం అందించి, సమాజంలో మంచిని పెంపొందించాలనే సత్సంకల్పముతో యువభారతి స్థాపించబడింది. యువభారతితో సర్వులూ సాహితీ బాంధవ్యాన్ని పటిష్టంచేసుకోవాలనే ఉద్దేశ్యంతో "సాహితీమిత్ర" సభ్యత్వ పథకాన్ని చేపట్టి ఎందరినో సాహితీ మిత్రులుగా తీర్చిదిద్దింది.

## యువభారతి, భారతీమిత్ర పథకం :-

ప్రతి సంవత్సరం రూ॥ 10/- చందాచెల్లించి సాహితీ మిత్రులుగా పరిగణించబడే కంటే, ఒకేసారి "నూటపదహార్లు" అందించి శాశ్వత సభ్యులుగాచేరి యావజ్జీవం యువభారతి నుండి సదుపాయాలనందుకో గలరనే ఉద్దేశ్యంతో రూపొందించ బడినదే "భారతీమిత్ర" సభ్యత్వ పథకం.

## భారతీ మిత్రులు కావాలంటే ! -

* కేవలం రూ॥ 116/-లు చెల్లించటంతో మీరు శాశ్వతంగా యువభారతి "భారతీ మిత్రులు"గా పరిగణించ బడతారు. పైమొత్తాన్ని ఒకేసారి చెల్లిస్తే మంచిది.
* ఒకేసారి రూ॥ 116/-లు చెల్లించక పోతే మొదటి వాయిదాగా రూ॥ 16/-లు చెల్లించి మిగిలిన మొత్తాన్ని నెలకు రూ॥ 10/-ల చొ॥న పది సమానమైన వాయిదాలలో చెల్లించవచ్చు.
* మొదటి వాయిదా రూ॥ 16/-లు చెల్లించగానే మీకు "భారతీ మిత్ర" సభ్యత్వ సంఖ్య కేటాయించబడుతుంది. యువభారతి ప్రచురణల నుండి మీరు ఎన్ను కొన్న రూ 12/-ల విలుగల పుస్తకాలను అందుకుంటారు. రూ॥ 116/-రు చెల్లించినవారు మాత్రమే యువభారతి 'భారతీ మిత్రులు''గా పరిగణింప బడతారు.

## పూర్తి సభ్యత్వం చెల్లించి భారతీ మిత్రులయితే మీకు :

* "భారతీమిత్ర" గుర్తింపు కార్డు అందజేయబడుతుంది.
* ప్రతి సంవత్సరం రూ॥ 12/-ల విలువగల యువభారతి ప్రచురణలు (ప్రచురణలపై పేర్కొన్న వెల ప్రకారం) జీవిత పర్యంతం అందజేయబడతాయి.

గమనిక : పుస్తకాలు పోస్టులో పొందగోరే మిత్రులకు రూ॥ 16/- విలువగల పుస్తకాలను పోస్టేజిమేరకు అంటే దాదాపు రూ॥ 2-00 లకు వి.పి.పి.లో పంపించడం జరుగుతుంది. మిత్రులు ఆ మొత్తాన్ని చెల్లించి తమ భారతీమిత్ర సభ్యత్వ పుస్తకాలను విడిపించుకో మనవి. పుస్తకాలు మిత్రులకు భద్రంగాచేరేందుకు

వీలుగా ఈ చిన్నమార్పు చేయడం జరిగింది. స్థానికేతరులైన భారతీమిత్రులు దీనిని గమనించి సహకరించ ప్రార్థన.

* యువభారతి ప్రచురణలన్నింటినీ 25% మినహాయింపుతో మీ సొంతం చేసుకునే సదుపాయాన్ని శాశ్వతంగా పొందవచ్చు. పోష్టేజీ అదనం అని గమనించండి.

## "భారతీ భూషణ" సభ్యత్వ పథకం

వదాన్యులయిన సాహితీ బంధువులు తమ సహాయ, సహకారాలను పెద్దమొత్తంలో అందించి యువభారతి కార్యక్రమాలకు ఊపిరిని, ఉత్సాహాన్ని అందించి, ప్రోత్సహించేందుకు యువభారతి "భారతీ భూషణ" పథకాన్ని ప్రారంభించింది.

### భారతీ భూషణులు కావాలంటే :

రూ॥ 1,116/-లు గాని అంతకు మించిగాని, మొత్తాన్ని ఒకేసారి లేక పది సమాన వాయిదాలలో అందించిన వారిని 'భారతీ భూషణు''లుగా సమాదరిస్తుంది.

### ఇలా పెద్దమొత్తంలో విరాళ మిచ్చిచ 'భారతీ భూషణులకు'

* సభ్యత్వం పూర్తిగా చెల్లించిన వెంటనే "భారతీ భూషణ" గుర్తింపు ఫలకం అందజేయ బడుతుంది.
* యువభారతి కార్యక్రమాల గురించి అన్ని వివరాలూ ఎప్పటికప్పుడు తెలియజేయడం జరుగుతుంది.
* యువభారతి వెలువరించే అన్ని ప్రచురణలనూ, భారతదేశంలో ఎక్కడ ఉన్నా సరే శాశ్వతంగా ఉచితంగా అందించటం జరుగుతుంది.

  గమనిక :- విదేశాలలో ఉండే భారతీ భూషణులు పోష్టుఖర్చులు తామే భరించాలి.
* యువభారతీ ఉపన్యాస కార్యక్రమాలలో మీరు ప్రత్యేక ఆహ్వానితులుగా పాల్గొనవచ్చును.

మా స్నేహాహ్వానాన్ని స్వీకరించండి! భారతీమిత్రులుగా, భారతీభూషణులుగా చేరండి! యువభారతి సుస్థిర భవిష్యత్ కార్యక్రమాలకు మీ చేయూత నందించండి.

వివరాలకు : యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

లేదా

యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

# మా మాట

కేవలం సాహిత్యానికి సంబంధించిన అంశాలనేకాక, సమాజాన్ని, సంస్కృతినీ అవగాహన చేసుకునేందుకు తోడ్పడే అంశాలనుకూడా, సరళమైన భాషతో దిఙ్మాత్రంగా నయినా పఠనాసక్తి ఉన్న అక్షరాస్యులకు అందించాలని యువభారతి ఆశయం.

అనాదృత వాఙ్మయంగా పండితుల పరిశీలనకు నోచుకోని జానపదుల గేయాలనూ, కథలనూ, విజ్ఞానాన్నీ, వినోదాలనూ, బ్రతుకుబరువులను, అధ్యయనం చేయవలసిన అగత్యం ఉందని ఈ శతాబ్దం తొలిరోజుల్లో కొందరు పండితులు తలపోసినారు. ఆచార్య బిరుదురాజు రామరాజుగారు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి పర్యవేక్షణలో జానపద గేయవాఙ్మయాన్నిగూర్చి ప్రామాణికమయిన పరిశోధనచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి డాక్టరేట్ పట్టాను సంపాదించినారు. ఆచార్య రామరాజుగారు సాధించిన ఈ సిద్ధి ఎందరో విద్వాంసులను ఆకర్షించింది. జానపద సాహిత్యాధ్యయనం విశ్వవిద్యాలయాల్లో పఠనీయ విషయంగా, పరిశోధనాంశంగా స్థానం సంపాదించుకొనగలిగింది.

యువభారతి జానపద సాహిత్యం రూపురేఖలనుగూర్చి ఒక పరిచయాత్మకమైన పుస్తకాన్ని వ్రాసి ఈయవలసిందిగా డా॥ ఆర్.వి.ఎస్. సుందరంగారిని అభ్యర్థించింది. ఆ అభ్యర్థనకు ఫలితం ఈ పుస్తకం.

ఈ పుస్తకం జానపద సాహిత్య పరిధులనుగూర్చి, స్వరూపస్వభావాలనుగూర్చి తమ్ముతాము, నాగరికులమనుకునేవాళ్ళకు ఉన్న దురూహలను తొలిగించగలుగుతుందని నమ్మినాము.

డా॥ అర్.వి.ఎస్. సుందరంగారు మైసూరు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో అధ్యాపకులు, ఇన్స్టిట్యూట్ ఆఫ్ కన్నడ స్టడీస్, మైసూరు విశ్వవిద్యాలయంలో ఒక విభాగం, ఆ విభాగంలో డా॥ సుందరంగారు అధ్యాపకులు, పరిశోధకులు. తెలుగు, కన్నడ జానపద గేయాలను తులనాత్మకంగా పరిశీలించినవారు. తెలుగులోను, కన్నడంలోను, ఇంగ్లీషులోను, పుస్తకాలు ప్రచురించినారు వీరిది పండిత వంశం. మంచివక్తలు. వచన రచనలో ఆరితేరినవారు. భాషాశాస్త్రం (లింగ్విస్టిక్సు)లో కూడా కృషిచేసి కన్నడంలో పుస్తకాలు ప్రచురించినారు.

మా యువభారతికి ఈ పుస్తకాన్ని రచియించి యిచ్చి ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా॥ ఆర్.వి.ఎస్. సుందరంగారి సాహిత్య స్నేహానికీ సౌహార్దానికీ మా కృతజ్ఞతాభివందనములు.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు
యువభారతి.

హైదరాబాదు
5 డిశంబరు, 1982

# ముందు మాట

ఒక ప్రాంతానికి చెందిన జానపద సాహిత్యం ఎలా వికాసంచెందుతుంది, దాని స్వరూపం ఏమిటి, దాని అధ్యయనంవల్ల ప్రయోజనం ఏమిటి, దానిలో ఎలాంటి సొగసులుంటాయి - ఇలాంటి విషయాలను తెలుసుకోవలసిన అవసరం ఎంతోవుంది. జనజీవనం నాడి వుండేది జానపద సాహిత్యంలో. తెలుగువారి సంస్కృతి నిజస్వరూపం కనిపించేది తెలుగు జానపద సాహిత్యంలో. ఈ విషయాన్ని ఎవ్వరూ గంభీరంగా ఆలోచించటం లేదు. దీన్ని గంభీరంగా ఆలోచించిన తమిళులు 'తమది' అంటూ అత్యంత ప్రాచీనసాహిత్యాన్ని చూపి చెప్పగల్గుతున్నారు. గాధాసప్తశతి కాలంలోనే పెళ్ళిళ్ళలో, పొలంగట్లలో వినిపిస్తుండిన తెలుగుపాటలను భద్రపరచివుంటే, వందలు వేల సంవత్సరాలనుంచి తెలుగుగడ్డమీద నెత్తురు ఉరకలెత్తిస్తుండిన వీరగాధల్ని ఆదరంగా చూచివుంటే - తెలుగువాళ్ళుకూడా తమ సంస్కృతిని ప్రతిబింబించే సాహిత్యాన్ని లోకానికి చాటిచెప్పగలిగివుండేవారు. ఒక్క ఉదాహరణ దయచేసి గమనించండి. మన రంగనాథ రామాయణం తమిళ కంబ రామాయణానికి ఎంతమాత్రమూ తీసిపోదు కాని కంబనికి జాతీయస్థాయిలో వున్న పేరుప్రతిష్టలు మన కవికి ఎందుకులేవు? తమిళ మహాకావ్యంగా కీర్తింపబడుచున్న సిలప్పదికారాన్ని తలదన్నే రచనలు తెలుగులో చాలా వున్నాయి. కాని మన కావ్యాలకు ఎందుకు ప్రాశస్త్యం లభించటంలేదు? ఇవన్నీ ప్రతి తెలుగు విద్వాంసుడూ గంభీరంగా ఆలోచించవలసిన విషయాలు.

తెలుగువారి ఆచారవ్యవహారాలను, నమ్మకాలను, పండుగలను, కట్టుబొట్టు, మాటమంతీ, పెళ్ళిపేరంటం మొదలైన వాటిని ప్రతిబింబించే సాహిత్యం మహావిద్వాంసుల సాహిత్యవిమర్శకు నిలవదేమో! కాని ఆంధ్రేతరులకు మనల్ని గురించి చెప్పాలంటే జానపద సాహిత్యాన్నే ప్రథమంగా చెప్పుకోవాలి. ఉత్తమ సాహిత్యపు విలువలు గల సాహిత్యాన్ని సృష్టించి ఇతర ప్రాంతాలవారికి కూడా మార్గదర్శకులయ్యే ఎత్తుకు మన కవులు ఎదగగలిగితే మనందరికీసంతోషమే. కాని ఏదోఒక భాషాసాహిత్యాలను, ఇజాలను భేషజాలను అనుకరించటంలో తృప్తిపడే మన సాహితీవేత్తలనుంచి అంతర్జాతీయస్థాయి సాహిత్యాన్ని ఆశించలేము. కనీసం మనది అని చెప్పుకోగల్గిన దాన్ని ముద్దుమాటల్లో, సహజాలంకారాల్లో, సామెతల్లో, పలుకుబళ్ళలోచెప్పే జానపదుల అమాయకత్వాన్ని, అకృతకకావ్యధర్మాన్ని సహృదయంతో అర్థంచేసుకునే స్థాయికయినా మనం ఎదగాల్సివుందనిపిస్తుంది.

ఇటీవలి కాలంలో జానపద విజ్ఞానంవైపు అనేక విద్వాంసులదృష్టి మరలింది. ప్రపంచంలోని పలుప్రాంతాలలో జానపద విజ్ఞాన అధ్యయనద్వారా సంస్కృతి, మానవ శాస్త్రం, సామాజికశాస్త్రం, భాషావిజ్ఞానం, పురాతత్వశాస్త్రం మొదలైనవాటికి కలిగే ప్రయోజనాల్ని విద్వాంసులు గుర్తించారు. జానపద విద్వాంసులనే ప్రత్యేక శాఖ ఒకటి ఏర్పడుతున్నది. తెలుగును గురించికూడా ఇప్పుడిప్పుడే శాస్త్రీయ పరిశోధనచురుగ్గా సాగుతుండడం సంతోషాన్ని కలిగిస్తున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఈ విషయంలో అందరికంటె ముందంజవేసింది. నాగార్జునలో కోలాటం గురించి, ఆటలగురించి మంచి పరిశోధనగ్రంథాలువెలువడ్డాయి. బెంగుళూరులో డా॥ జి. ఎస్. మోహన్ అనంతపురం స్త్రీలపాటలను పరిశీలించి పి. హెచ్. డి. పొందారు. మైసూరులో 'తెలుగు కన్నడ జానపద గేయాల' పరిశోధన తులనాత్మకవిమర్శలో మొదటిదయింది. నా దగ్గరే మిత్రుడు డా॥ టి. గోపాలకృష్ణారావు తెలుగుకన్నడాలలో జానపద రామాయణాలను గురించి పరిశోధనచేసి పి. హెచ్. డి. పొందాడు. అనంతపురంజిల్లా జానపద కథలను గురించి, కాటమరాజు కథల సాంస్కృతిక అధ్యయనాన్ని గూర్చి పరిశోధన జరుగుతున్నది. అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో పల్నాటివీరచరిత్రను గురించి పరిశోధన జరిగింది. 'పలనాటి జానపద మహాకావ్యం' పేరుతో అక్స్ఫర్డ్ వాళ్ళు ప్రచురిస్తున్న రొఘైర్ గారి పుస్తకం ప్రపంచంలో అనేక విద్వాంసులదృష్టిని ఆకర్షిస్తుంది. తెలుగు జానపద సాహిత్యానికి ప్రపంచమందంతటా గుర్తింపు ఏనాటికైనా వస్తుందని ఆశిద్దాం.

పుస్తకప్రచురణతో క్రొత్తప్రమాణాలను నెలకొల్పిన యువభారతికి జానపద సాహిత్యంపైన ఆసక్తి కలగడం ముదావహం. జానపదసాహిత్య సేకరణగాని, అధ్యయనం గాని, ప్రచురణగాని సంస్థలవల్ల జరగాల్సిందేగాని వ్యక్తులవల్ల సాధ్యమయ్యేదికాదు. ఈ చిన్నపొత్తాన్నివ్రాసి ఇవ్వవలసిందిగా నన్ను కోరినందుకు యువభారతి వారిని, ముఖ్యంగా డా. ఇరివెంటి కృష్ణమూర్తిని నాలుగుకాలాలపాటు స్మరించుకుంటాను. ఆసక్తి, అభిరుచి, అభినివేశం ఎంతవున్నా గ్రంథప్రచురణకు అవకాశాలు అంతంతమాత్రంగా వున్న ప్రస్తుతకాలంలో యువభారతి వంటి సంస్థల ప్రోత్సాహం క్రొత్త వూపిరినిస్తుంది. తరతరాల తెలుగు సంస్కృతిని తెలియజెప్పే ఇలాంటి ప్రయత్నాలను యువభారతి ఇకముందుకూడా ప్రోత్సహించాలని కోరుతున్నాను.

మానస గంగోత్రి
మైసూరు - 6
19-11-1982

ఆర్వీయస్. సుందరం

# జానపద సాహిత్యం

## జానపద సాహిత్యం అంటే ?

ఒక్కొక్క ప్రాంతానికి, భాషకు, జనసముదాయానికి ప్రత్యేకమైన సాహిత్యం, అలవాట్లు, అభిరుచులు, పండుగలు, దుస్తులు, ఆటలు, పాటలు, వంటలు, వైద్యం, కళలు మొదలైనవి ఉంటాయి. వీటిలో కొన్ని మానవుని బౌద్ధిక లతకు వికసించిన పుష్పాలు, నాగరికతా వాస్తుశిల్పి నిర్మించిన కట్టడాలు, మరికొన్ని ప్రాకృత మానవ హృదయ పద్మంలోంచి పెల్లుబికే మకరందాలు, స్వభావసిద్ధంగా ప్రకృతిలో పరుగులెత్తే సెలయేటి గలగలలు. శాస్త్రీయంగా, సలక్షణంగా, సహేతుకంగా, సవిమర్శకంగా నిర్మితాలైన సాహిత్యగ్రంథాలు, రమణీయ శిల్పాలు, అపురూప నాట్యాలు శిష్టసంస్కృతి అనిపించు కుంటాయి వ్యక్తికన్న సమష్టి మిన్న అని భావించి, సమాజంలో భాగంగా జీవించే జాన పదుల ఆటలు, పాటలు, ఆభరణాలు, అలంకారాలు, కళలు, కట్టడాలు, పండుగలు, పబ్బాలు మొదలైనవి జానపద సంస్కృతి అనిపించుకుంటుంటాయి. ఆంధ్రుల సంస్కృతి అనగానే మనం నాగరికత ఒడిలో పుట్టి పెరిగిన మహోన్నత శిల్పసౌందర్యంవైపు, గ్రంథాలవైపు, శాస్త్రాలవైపు దృష్టి సారిస్తాం. కాని యిది తప్పు. ఆయా కాలాల్లో మనిషి తన అభ్యున్నతికోసం చేసిన కృషి అంతా సంస్కృతిలో భాగమే. అందువల్ల శిష్టసంస్కృతికి ఇచ్చినంత విలువనే మనం జానపద సంస్కృతికికూడా ఇవ్వవలసి ఉంటుంది.

జానపదులంటే ఎవరు అన్నదీ ఒక ప్రశ్నే. గ్రామీణులు, విద్యావిహీనులు మాత్రమే జానపదులనేది పాతమాట. జానపదులంటే ఏదయినా ఒక్క విషయంలోనైనా భావసామ్యం కలిగిన జనసముదాయం. వీరు భాషకు సంబంధించినవారు కావచ్చు, ఒక ప్రదేశంలో నివసిస్తున్నవారు కావచ్చు, ఒకేజాతికి, మతానికి, వృత్తికి సంబంధించినవారు కావచ్చు. అయితే యీ జనసముదాయం తమవే అని చెప్పుకోగలిగిన కొన్ని సంప్రదాయా లను కలిగివుండాలి. ఒక కుటుంబంలోని పద్ధతులు, నమ్మకాలు, వారి ఇంటిపేరును గురించిన కథలు వగైరా చేరిస్తే ఇంటింటి జానపద విజ్ఞానమవుతుంది. అట్లే ఆంధ్రుల భాష, సంప్రదాయాలు, ఆచారాలు, నమ్మకాలు మొదలైనవన్నీ కలిసి ఆంధ్రుల జానపద విజ్ఞానమవుతుంది. జానపదులను ఈ విధమైన అధునిక దృక్పథంతో నిర్వచిస్తే ఆటవికులు, గిరిజనులు, గ్రామీణులు, నగరవాసులు – అందరూ 'జానపదులు' అనే పరిధిలోకి వస్తారు.

అయితే జానపదులు కానివాళ్లెవరు అనే ప్రశ్న వస్తుంది. నిజానికి జానపదులు కానివాళ్ళెవరూలేరు. అందరికీ ఏవో కొన్ని నమ్మకాలు, ఆచారాలు, కళలు మొదలైనవి ఉంటాయి. జానపద విజ్ఞానంలో సాంప్రదాయికంగా ఒకతరంనుంచి మరొక తరానికి సంక్రమించే సాంస్కృతిక విషయాలు భాగంగా ఉంటాయి. వీటికి అనేక పాఠాంతరాలుంటాయి. ఇవి మామూలుగా మౌఖికంగా ప్రసారమవుతుంటాయి. మొత్తంమీద ప్రాచీనతను ప్రతిబింబించే సాంప్రదాయిక విజ్ఞానమే జానపద విజ్ఞానం. మరోవిధంగా చెప్పాలంటే జానపద సంస్కృతే జానపద విజ్ఞానం.

జానపద సాహిత్యం అన్నది జానపద విజ్ఞానంలో ఒక భాగం. మౌఖిక జానపద విజ్ఞానాన్ని మనం జానపద సాహిత్యం అనే పేరుతో పిలుస్తుంటాం. ఇదికాక సాంఘిక జానపదాచారాలు, వస్తుసంస్కృతి, జానపద కళలు అన్నవి జానపద విజ్ఞానంలో భాగాలు. జానపద విజ్ఞానాన్ని ఈ క్రింది విధంగా విభజించవచ్చు

### జానపద విజ్ఞానం

| జానపద సాహిత్యం | సాంఘిక జానపదాచారాలు | వస్తుసంస్కృతి | జానపదకళలు |
|---|---|---|---|
| జానపద గేయాలు | జీవనచక్రానికి సంబంధించిన ఆచారాలు | చిత్రకళ, శిల్పం | వీధిభాగోతం |
| కథాగేయాలు | కుటుంబం | వాస్తుకళ | తోలుబొమ్మలు |
| కథలు, | సంబంధబాంధవ్యాలు | వృత్తిసాధనాలు | వాద్యసంగీతం |
| సామెతలు | పండుగలు | దుస్తులు | గాత్రసంగీతం |
| పొడుపు కథలు | ఆటలు | అలంకరణ సామగ్రి | యక్షగానం |
| | జానపద వైద్యం | ఆభరణాలు | బహురూపులు |
| | జానపదుల మతం | ఆహార సామగ్రి | పగటివేషాలు |
| | నమ్మకాలు | విగ్రహాలు | గారడివిద్య |
| | మొదలైనవి. | మొదలైనవి | మొదలైనవి |

పై సంక్షిప్త వివరణనుబట్టి జానపద విజ్ఞానం సువిశాలక్షేత్రమని, అందులో జానపద సాహిత్యం ఒక భాగమని తెలుస్తుంది. ఈ సాహిత్యాన్ని ప్రజావాఙ్మయము,

పదవాఙ్మయము, అనాదృత వాఙ్మయము, మధుర కవితలు, దేశిసారస్వతము మొదలైన పేర్లతో తెలుగు విద్వాంసులు వ్యవహరించారు. వీటన్నిటికీ అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలున్నాయి. 'జానపద శబ్దం ఎలా సార్థకమవుతుందనే విషయాన్ని ప్రొ॥ సాళ్వ కృష్ణమూర్తిగారు చక్కగావివరించారు. ' మానవుని ముగ్ధ పకృతి, సృష్టి వలెనే, అనాది దానికి జానపదులు నగరవాసులన్న భేదంలేదు. సంస్కారం పేరుతో కృత్రిమతా వివశులైన నగరవాసులకంటే జానపదులెక్కువగా ముగ్ధత మెలుస్తారు గనుకనే ముగ్ధతా ప్రధానమైన భాషాసంబంధి రచనలకు 'జానపద' దశ విశిష్టత యేర్పడింది'' (మంగళాశాసనం, జానపద సాహితం స్వరూపం, ఆర్వీయస్ సుందరం). అయితే దీన్ని సాహిత్యమనరాదంటారు శ్రీ సాళ్వగారు. ''ఈ రచనలు దోషహీన, గుణోపాదాన, అలంకారయుక్తతా - రసావియోగత్వములనే సంస్కారాలు చాలమిని 'సాహిత్య' మనరాక, లేఖన దూరములగుటచేత 'వాఙ్మయ' మనరాక, 'సారస్వత' మనబడటమే లెస్స అని నా తలంపు' (పూర్వోక్తం). హిత సహితమైనదే సాహిత్యమని ఒప్పుకునేట్లయితే జానపద సాహిత్యం కంటె ఉత్తమసాహిత్యం లేదు. జనజీవనంలో ఈ సాహిత్యం అనివార్యమైన అంగం. జానపదుల జీవితాకీ - ఈ సాహిత్యానికి విడదీయ రాని బంధం.

జానపద విజ్ఞానంలో జానపద సాహిత్యం ఒక భాగమని, ఇది గేయసాహిత్యంకంటె విస్తృతమైనదని అర్థం చేసుకుంటే చాలు. పారిభాషిక పదాలన్నీ సమగ్రము, సమంజసము అయిన అర్థాన్నే ఇస్తాయనుకోరాదు. అయితే సాధ్యమైనంతవరకు ఆధునిక అధ్యయనాలను దృష్టిలో ఉంచుకొని శాస్త్రీయావగాహనను అలవరచుకొని పారిభాషికపదాలను ఉపయోగించాల్సి ఉంటుంది. ఈ దృష్టితో చూచినపుడు ''జానపద సాహిత్యం'' అంటే జానపద గేయాలు, కథాగేయాలు, కథలు సామెతలు, పొడుపు కథలు అనే ప్రక్రియలను సూచించే పారిభాషిక పదం అని చెప్పుకోవచ్చు.

కొందరు యక్షగాన సాహిత్యంకూడా జానపద సాహిత్యంలో భావించడం వల్ల ఇక్కడొక చిన్న వివరణ ఆవసరమవుతున్నది. 'తెలుగుయక్షగాన సాహిత్యం' మన సాహిత్య చరిత్రలో ఒక అధ్యాయం. ఈ యక్షగానాలు సాహిత్యపువిలువ కలవి. అష్టభాషాపండితులైన రంగాజమ్మవంటి హేమాహేమీల రచనలవి. వీటికి సామాన్య ప్రజల్లో ఏనాడూ ప్రచారము లేదు అందువల్ల ఇవి జానపద అనుకరణలేగాని, జానపద సాహిత్యంలో భాగంకావు. ఇకనేటికీ జానపదుల్లో మిగిలివున్న వీధిభాగోతాలు, బయలాటలు, యక్షగానాలు సాహిత్యంగా కాక జానపద కళలుగా చెప్పదగినవి. గానం, అభినయం, వేషం, నృత్యం, హాసం - ఇవన్నీ చేరితేనే వీధిభాగోతం. అందువల్ల శిష్ట సాహిత్యంలో భాగమైన యక్షగాన సాహిత్యాన్ని తీసుకొనివచ్చి జానపద సాహిత్యంలో భాగంగా అధ్యయనం చేయడం సమంజసం కాదు.

## జానపద సాహిత్య - పుట్టుపూర్వోత్తరాలు

జానపద సాహిత్యం ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు పుట్టిందో చెప్పడం సులభంకాదు. జానపద విద్వాంసులు జానపద విజ్ఞానం ఉత్పత్తి వికాసాలను గురించి ఎన్నో సిద్ధాంతాలను ప్రతిపాదించారు. ఒక గేయాన్నే తీసుకుందాం. వానదేవుణ్ణి ప్రార్థిస్తూ మనం పాడే పాటల వంటివే కన్నడనాడులో ఉన్నాయి, తమిళనాడులోఉన్నాయి. శ్రీలంకలో, ఆఫ్రికాలో, అమెరికాలో ఉన్నాయి. వీటికన్నిటికి మూలం ఏది అనివెతుక్కుంటూ పోతే దొరికె ఆధారాలు చాలా తక్కువ. కొందరు ఇలాంటివన్నీ మానవుని ప్రాథమిక ప్రవృత్తుల అభివ్యక్తులే కాబట్టి వేరువేరు ప్రదేశాల్లో ఇవి స్వతంత్రంగానే అవతరిస్తాయంటారు. దీనికి బహుళోత్పత్తి వాదమని పేరు. మరికొందరు ఇవన్నీ ఎక్కడో ఒకచోట ఉదయించి మిగిలిన ప్రదేశాలకు వ్యాపిస్తాయంటారు. దీనికి ఏకోత్పత్తి వాదమని పేరు. బాలనాగమ్మ సారంగధర, కుమారరాముని కథ మొదలైనవి తెలుగుదేశంలో ఎంత ప్రచారంలో ఉన్నాయో, కన్నడదేశంలోనూ అంతే ప్రచారం పొంది వున్నాయి. ఇలాంటి సమాన కథాంశాలు వేరు వేరు ప్రదేశాల్లో స్వతంత్రంగా ఉద్భవించాయనిచెప్పి చేతులు కడుక్కో వచ్చు. కాని ఈ కథాగేయాలను పాడే గేయకులెవరు, వాళ్ళెక్కడి నుంచి వచ్చారు, వాళ్ళ మాతృభాష ఏమిటి వగైరా విషయాలను తరచిచూస్తే ఈ కథాగేయాల వేర్లెక్క డున్నాయో తెలుస్తాయి. తెలుగు మాతృభాషగా గల వృత్తిగాయకులు పాడే కొన్ని కన్నడ కథాగేయాలు బహుశా తెలుగుదేశం నుంచే వెళ్ళివుండాలి.

జానపద సాహిత్యం ఏ ప్రదేశంలో పుట్టి ఏయేప్రాంతాలకు పాకిందో చెప్పడ మయినా సులభమేమోగాని, ఎప్పుడు పుట్టిందని అడిగితే ఎవ్వరూ చెప్పలేరు. ఎందుకంటే ఇది సమష్టి సృష్టి. నాగరికతాఫలమైన శిష్ట సాహిత్యం వైయక్తిక ప్రతిభా సముద్భవం. రచయిత 'అహం' అందులో ప్రతిఫలిస్తూ వుంటుంది. నలుగురికి తెలియని, పలువురు వాడని జానపద సాహిత్యమంటూ లేనేలేదు. ప్రయోజనంలేని జానపద సాహిత్యప్రక్రియ ఒక్కటికూడా లేదు. గేయం సృష్టించిన జానపదుడు దాన్ని వినిపించకుండా వుండనే వుండడు. కథాగేయం అల్లిన వృత్తికళాకారుడు దాన్ని ప్రచారం చేయనిదే వదలడు. కథ తెలిసిన నాయనమ్మ మనమడికి చెప్పకుండా వుండదు. వాడని సామెతలు సామెతలే కావు. అందువల్ల అనేక పాఠాంతరాలు పుట్టుకొస్తాయి. పలువురి నోళ్ళలోనాసిన జానపద సాహిత్యంలో కాలానికి సంబంధించిన గుర్తులన్నీ సమసిపోతాయి. అయితే ఈసాహిత్యంలో ప్రతిబింబితాలైన అలవాట్లు, అభిరుచులు, నమ్మకాలు, ఆచారాలుమొదలైనవి ఏ కాలం తర్వాత ఇవి అవతరించాయని కొంతవరకు ఊహించటానికి ఉపయోగపడ్తాయి. అంతేకాని ఏ జానపద సాహిత్యప్రక్రియలోను ఖచ్చితంగా కాలాన్ని చెప్పే సూచనలుండవు.

జానపద సాహిత్యం ఎందుకు, ఏవిధంగా ఉద్భవిస్తుందో చెప్పటానికి ఉపయో గించేది మనోవిశ్లేషణ సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి మూలప్రేరణ సిగ్మండ్ ఫ్రాయిడ్,

కోరికలను అణచివుంచితే అవి కలలు రావడానికి కారణమవుతాయని ఫ్రాయిడ్ అభిప్రాయ పడ్డాడు. మానవునిలోని చేతన, సుప్తచేతన, అచేతన స్థితులను ఫ్రాయిడ్ విశ్లేషించి చూపాడు. జానపద విజ్ఞానం సామూహిక సుప్తచేతనస్థితిలో ఉద్భవిస్తుందని విద్వాంసులు అభిప్రాయపడ్డారు.

ఆధునిక మనస్తత్వ శాస్త్రాన్ని అన్వయించి చూచినప్పుడు జానపదసాహిత్యం ప్రాదుర్భవించిన పరిస్థితులు కొంతవరకైనా అర్థమవుతాయి. ఆధునిక మానవునితో పోల్చినపుడు ప్రాచీన మానవుడు సంఘజీవిగా కన్పిస్తాడు. వ్యక్తి సమాజంలో తానూ ఒకడినని భావించినప్పుడు అహాన్ని కోల్పోతాడు. చేతనస్థితిలోని వ్యక్తి గుంపుతో చేరినపుడు సుప్తచేతనలోకి వెళ్తాడు. లేక ఆతని సుప్తచేతన మేల్కొంటుంది. ఒక ఉదాహరణ చెప్పవచ్చు. ఎవరినైనా 'పాట పాడండి' అని అడిగితే సిగ్గుతో మెలికలుతిరుగుతారు. కాని నలుగురు పాడుతున్నపుడు ఏ మాత్రం సిగ్గుపడకుండా గొంతుకలుపుతారు. పాట పాడాలనే కోరిక, పాడే జాణతనం ఉన్నాకూడా చేతనస్థితిలో సిగ్గు అడ్డువస్తుంది. అందువల్ల సామూహిక సుప్తచేతన అన్నది మనిషిలో అణగారి ఎన్నోశక్తులను వెలికి తీస్తుంది. నాగరికులనుకూడా జానపదులుగామారుస్తుంది. జానపద సాహిత్యం చాలా ప్రాచీనమైనది, సమిష్టికరమైనది. ఒకవేళ సామెతలాంటి ఏ ఒకటిరెండు ప్రక్రియలో వ్యష్టిసృష్టిగా మొదలైనా అవి జానపద సామెతలు కావాలంటే సామూహిక పునఃసృష్టి తప్పదు. ఇలా ఒక్కొక్క గేయం వెనక, కథవెనక, పొడుపు కథ వెనక కొండవీటి చేంతాడంత ఐతిహ్యం ఉంటుంది. తరచి చూచినకొద్దీ చరిత్రబయలుపడదేమోగాని, జన జీవనం సంస్కృతిలోని లోతులుతెలుస్తాయి. ఇదే ఒకవిధంగా జానపద సాహిత్యంవల్ల ఒదిగే ప్రయోజనంకూడా.

## ఈ సాహిత్యంవల్ల ఏమిటి ప్రయోజనం ?

జానపద సాహిత్యం అధ్యయనం చెయ్యడంవల్ల ఒకప్రదేశంలోని జనుల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, సంస్కృతిఅర్థమవుతాయి. శిష్టసాహిత్యం వైయక్తిక ప్రతిభాసముద్భూతం కాబట్టి సమాజం దానిలో ప్రతిబింబించడం అంతగా సాధ్యంకాదు. కాని జానపద సాహిత్యం సామాజిక స్పృహతో వెలువడేదికాబట్టి జనుల సాంస్కృతిక అధ్యయనం నేరుగా సాధ్యమవుతుంది.

జానపద విజ్ఞానాన్ని ప్రయోజనాత్మకదృష్టితో పరిశీలించిన విద్వాంసులు ప్రకార్యాత్మక సిద్ధాంతాన్ని (functional theory) ప్రతిపాదించారు. ముఖ్యంగా సాంస్కృతిక మానవ శాస్త్రజ్ఞులు ఆదివాసిజనుల సాంస్కృతికాంశాల ప్రయోజనాల మీద ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించారు. జానపదసాహిత్యాన్ని సృష్టించేవారు ప్రకార్యాత్మక సమాజానికి చెందినవారు కావడంవల్ల, ఆ జనుల సాహిత్యప్రక్రియలు సంచలనాత్మకంగా

వుంటాయిగాని నిశ్చలంగావుండవు. ఏజానపద ప్రక్రియఅయినాసరే, దానికి నిర్దిష్ట ప్రయోజనమూ, కొన్ని ఉపప్రయోజనాలూ వుంటాయి. పొడుపుకథలు బుద్ధికి పదును పెడ్తాయి. సామెతలు అపారమైన అనుభవాన్ని ప్రతిబింబిస్తుంటాయి. కొన్ని అనాగరిక సమాజాల్లో సామెతలను న్యాయనిర్ణయానికి ఉపయోగిస్తారు. గ్రామీణ న్యాయస్థానాలలో వాదించుకునేటప్పుడు సామెతల్నే ప్రధానంగా ఉపయోగిస్తారు. పనిపాటలు పనిలో శ్రమను తగ్గిస్తాయని మనకందరకి తెలిసినవిషయమే రాజకీయపరంగాకూడా జానపద సాహిత్యం చక్కగాఉపయోగపడుతుంది వర్గసంఘర్షణకు జానపదసాహిత్యం అత్యుత్తమ ఆయుధమని కమ్యూనిస్టుదేశాలు గుర్తించాయి. తెలుగునాట అనేక ప్రజా ఉద్యమాలలో జానపద గేయ సాహిత్యం నిర్వహించిన పాత్ర గమనార్హమైంది. రాజకీయ పరంగా జానపద విజ్ఞానాన్ని ఉపయోగించుకోవడాన్ని విశ్లేషించేసిద్ధాంతానికి పై చారికాత్మక (ideological) సిద్ధాంతమని పేరు.

జానపద సాహిత్యంవల్ల సమాజానికిఒరిగేదేమిటి అని విద్వాంసులు ప్రశ్నిస్తుంటారు. దానికి సాహిత్యపరంగా విలువఏముందని పెదవివిరుస్తారు. కాని అంతకంటె ముఖ్యమైన ప్రయోజనాలు ఈ సాహిత్యానికి ఉన్నాయని ఎవరైనా ఒప్పుకోక తప్పదు. జానపదంవిజ్ఞానంచేసే ముఖ్యమైన పనులలో సంస్కృతిని పరిరక్షించడంఒకటి. సంస్కృతికి సంబంధించిన విషయాలు కాలగర్భంలోకలిసిపోకుండా ఈ సాహిత్యం కాపాడుతుంది. ఉదాహరణకు తరతరాలుగా మన సమాజంలో భాగంగా ఉన్న నమ్మకాలు ఆచారాలు, సంప్రదాయాలు మొదలైనవన్నీ శిష్ట సాహిత్యం కన్నా ఎక్కువగా జానపద సాహిత్యంలోనే ప్రతిబింబిస్తాయి. ఎందుకంటే అది ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమించేది, శిష్టసాహిత్యం ఆయా తరాలలోని వ్యక్తులు సృష్టించేది అందుకే మనం ఈనాడు ధరించడానికి సిగ్గుపడుతున్న దుస్తులు, ఏడువారాల సొమ్ములు, ఇతర అలంకరణ లన్నీ పెట్టెలలో లేకున్నా గేయాలలో, కథాగేయాలలో భద్రంగా ఉన్నాయి.

మనిషికి ఉల్లాసాన్ని, ఆనందాన్ని కల్గించడం జానపద సాహిత్యంవల్ల కలిగే మరో ప్రయోజనం, ఎంతటి పనినైనా శ్రమతెలియకుండాచేయడానికి తగిన ఉల్లాసాన్ని గేయాలిస్తాయి. వీరగాథలను వింటూవుంటే ఆనందం, ఆవేశం, ఉద్రేకం పెల్లుబికివస్తాయి. జోలపాటలు పిల్లలను జోకొట్టి నిద్రింపజేస్తాయి. పిల్లల పాటలు ఆటల్లో మంచివూపును ఇస్తాయి వినోదాన్ని కలిగిస్తాయి. పడవ పాటలు చల్లని పిల్లగాలులతో నేస్తం కడతాయి. తాత, నాయనమ్మ చెప్పే కథలు కంచికిపోయేముందే పసిపిల్లల ఉత్సుకతను రేకెత్తిస్తాయి. ఇలా జానపద సాహిత్యం ఆబాలగోపాలమూ సంతోషపడేట్లు చేస్తుంది.

జానపదుల నిజమైన విద్యాభ్యాసానికి, లోకజ్ఞానానికి హేతువు వారి సాహిత్యమే. ఒడిలో చదివేచదువు కొంతే, సమాజం నుంచి నేర్చుకునే చదువు కొండంత. పసిపిల్లలు ఆటలాడకుంటే వాళ్ళ మనస్సు చెడుతుంది. దేహారోగ్యమూ చెడుతుంది. శారీరక శిక్షణ

అన్నది జానపదులు తమకుతామే సహజంగా నేర్చుకున్నదేగాని ఒకరు నేర్పింది కాదు. పసిపిల్లలకు పెద్దలుచెప్పే కథలవల్ల వినోదమేకాక విజ్ఞానమూ లభిస్తుంది. అనేక విషయాలను వారు ఆలోచించేటట్లు చేస్తాయి కథలు. ప్రశ్నించే మనస్తత్వాన్ని పెంపొంది స్తాయి. పొడుపుకథలు జానపదుల బుద్ధికిపదునుపెట్టే సమస్యలు. ముక్తపదశాస్త్రాలు పదజ్ఞానానికి సాటి అయింది మరొకటి లేదు. ఇవి జానపదులకు ఎన్నో పాఠాలు నేర్పి స్తాయి, వారిని సంస్కారవంతులుగా తీర్చిదిద్దుతాయి.

జానపద సాహిత్యం వల్ల మరోప్రయోజనం మనిషిమనసులో సుప్తంగా ఉండే కోరికలకొక రూపాన్ని కల్పించడం. మనస్తత్వశాస్త్రపరంగా ఇది చాలా ముఖ్యమైనదే. మనిషి తనకోరికల్ని కొంతవరకే అణచుకోగలుగుతాడు. అణచుకోలేని కోరికల్ని నాగరిక సభ్యసమాజంలో వ్యక్తంచేయడంకూడా సాధ్యంకాకపోవచ్చు అలాంటప్పుడు జానపద సాహిత్యాన్ని ఆశ్రయించవలసి వుంటుంది. ఒక ఉదాహరణతో దీన్ని స్పష్టం చెయ్యవచ్చు. అశ్లీలపదాలను ఉచ్చరించడానికి సభ్యత, సంస్కారంఅడ్డువస్తాయి. ఒక్కొక్కసారి ఇష్టంవున్నా ఇలాంటి పదాలను ఉచ్చరించడానికి వెనకాడుతాము. కాని జానపద గేయాలలో, సామెతలలో, కథాగేయాలలో ఇలాంటిపదాలు అశ్లీలమనే అని పించవు. పొడుపుకథలు కొన్నిట్లో అర్థం గంభీరమైనదైనా శబ్దాలు అశ్లీలమైనివిగా ఉంటాయి. ఈ ఉదాహరణలవల్ల జానపద సాహిత్య ప్రక్రియలు నిషేధాలుగా (taboos) ఉండే అనేక విషయాలకు ఆశ్రయంఇస్తాయని తేలింది. ప్రతి సంస్కృతిలో కూడా ప్రవర్తన నియమావళి అని ఒకటుంది. సంస్కృతిని పరీక్షించేందుకు సహాయపడే జానపద విజ్ఞానం, అదే సంస్కృతిలోని ప్రవర్తన నియమావళిని అతిక్రమించడానికి కూడా సహాయపడుతుందంటే ఆశ్చర్యమే.

పైన పేర్కొన్నవాటితోబాటు ప్రతి జానపద సాహిత్యప్రక్రియకు ప్రత్యేకమైన ప్రయోజనాలున్నాయి. ఒక్కజానపదగేయాన్నే తీసుకుంటే పసిపాటలకు, పారమార్థిక గేయాలకు, లాలిపాటలకు, ఆటపాటలకు వలపుపాటలకు అన్నిటికీ ఏదో ఒకప్రయోజనం ఉండనే ఉంటుంది. వీటి అన్నిటివల్ల జానపద సాహిత్యం జనజీవనంలో ప్రధానమైన భాగం అని అర్థమవుతుంది.

## జానపద సాహిత్యంలో విభాగాలు

మొత్తం జానపద విజ్ఞానాన్ని స్థూలంగా రెండు విభాగాలు చేయవచ్చు. అవి: 1. శాబ్దిక జానపదవిజ్ఞానం 1. శాబ్దికేతర జానపదవిజ్ఞానం. సాహిత్యమంతా శాబ్దిక కళల్లోకి వస్తుందని వేరేచెప్పనిలేదు. మరికాస్త ఎక్కువగా విభజనచేస్తే నాలుగు విభాగాలేర్పడతాయి. 1. మౌఖిక జానపదవిజ్ఞానం 2. సాంఘికాచారాలు 3. వస్తు సంస్కృతి 4. జానపదకళలు. వీటిలో సాహిత్యం మౌఖిక జానపద విజ్ఞానశాఖకు చెందుతుంది.

జానపద విజ్ఞానాన్ని సూక్ష్మదృష్టితో విభజనచేసి ముఖ్యవిభాగాలను, ఉప విభాగాలను గుర్తించి శాస్త్రీయఅధ్యయనానికి దారిచూపించినవారు ఆర్. ఎస్. బాగ్స్. ఆయన విభజనలో జానపదవిజ్ఞానం శీర్షిక క్రింద ఈ క్రింది వాటిని ముఖ్యంగా అధ్యయనం చెయ్యాలి :

1. సామాన్య జానపద విజ్ఞానం
2. గద్యకథనం
3. కథాగేయం, గేయం, నృత్యం, ఆట, సంగీతం, గద్యం
4. నాటకం
5. ఆచారం, ఉత్సవం
6. భూగోళం
7. భాష
8 కళ, చేతిపనులు, వాస్తువు
9. ఆహారం, పానీయం
10. నమ్మకం
11. వాక్కు
12. సామెత
13. పొడుపుకథ

పైవాటిలో మళ్ళీ అనేక ఉపవిభాగాలను సూచించారు ఆర్. ఎస్. బాగ్స్. కంప్యూటర్ వంటి ఆధునిక యంత్రాలను ఉపయోగించి జానపదగేయంవంటి ఒక్కొక్క ప్రక్రియలోను వేలకొద్ది ఉప విభాగాలను గుర్తించి, పోల్చి, పరిశీలించవచ్చు.

జానపద సాహిత్యాన్ని మాత్రం మనపరిశీలనకు గ్రహించినప్పుడు, అందులో ముఖ్యంగా గేయం, కథాగేయం, జానపద కథ, పొడుపుధక, సామెత అన్న ప్రముఖ ప్రక్రియలున్నాయని చెప్పవచ్చు. గేయాన్ని కథాగేయాన్ని కలిపిచెప్పాల్సినపుడు జానపదకవిత్వం అనాలి. అంతేగాని గేయాలలో కథాగేయాలను కలపకూడదు. జనప్రియ కథలతోబాటు ఐతిహ్యాలను, పురాణాలను (omytes) చేర్చుకుంటే గద్య కథనాలని (Prose narratives) చెప్పవచ్చు. ఈ శాఖలను, ఉపశాఖలను ఈ క్రింది పట్టీలో చూపించవచ్చు.

- జానపద సాహిత్యం
  - జానపద కవిత్వం
    - గేయం
    - కథాగేయం
  - గద్య కథనాలు
    - కథ
    - ఐతిహ్యం
    - పురాణం
  - సామెత
  - పొడుపు కథ

జానపద గేయం: జానపద సాహిత్యమనగానే మన మనసుకు వచ్చేది గేయమే. పదాలని, పాటలని జానపదులు పిలుచుకునే ఈ లయాత్మక రచనలు ఆశుకవితలు, అప్రయత్న రచనలు, భావ నిర్భరతవల్ల ఉదయించే రసవద్గంగాజలాలు. 'అజ్ఞాతకర్తృత్వం, సామూహిక ప్రచారం, వాక్సంప్రదాయం, జనప్రియత్వం, సారళ్యం, అనేకుల మనస్సుల నాకర్షించి సంపాదించిన జాతీయత" జానపదగేయ లక్షణాలని ఛేంబర్స్ విజ్ఞాన సర్వస్వం చెప్తున్నది. గేయం వ్యష్టిసృష్టి అయినా, సమష్టి సృష్టి అయినా నలుగురి నోళ్ళలోపడి అది పునఃసృష్టి చెందినపుడే జానపద గేయం అనిపించుకుంటుంది. "హృదయంలో ఉన్న ఆనందమో, ఆవేశమో. దుఃఖమో, కష్టమో పైకి వెళ్ళబుచ్చుకుందేనేగాని హృదయ భారం తీరదు. ఇదే జానపద కవిత్వంగా వెలువడింది. హృదయభారం తీర్చుకోవడమే మానవస్వభావము" అన్నారు శ్రీ నేదునూరి గంగాధరం (జానపదగేయ వాఙ్మయ వ్యాస వళి, పు-3).

జానపదగేయాలలో ముఖ్యంగా లౌకిక గీతాలు, పారమార్థిక గీతాలని రెండురకా లున్నాయి. ఆశ్రయాన్నిబట్టి వీటిని 1. పురుషుల గీతాలు 2. స్త్రీల పాటలు 3. ఉభయుల గీతాలు 4. పిల్లలపాటలు అని నాలుగు విభాగాలుగా చెయ్యవచ్చు. ఆర్. ఎస్. బాగ్స్ తన వర్గీకరణలో జానపద గేయాల ఐదురకాలను పేర్కొన్నాడు. అవి 1. భావోద్వేగం 2. దైనందిన జీవితం 3. జీవిత చక్రంలోని ముఖ్య ఘట్టాలు 4. పిల్లలపాటలు 5. మత సంబంధగీతాలు. అన్నిరకాల విభజన పద్ధతులను పరిశీలించిన తర్వాత జానపద గేయా లలో ఈ క్రిందివి ముఖ్యమైనవనిపిస్తాయి.

1. పనిపాటలు, 2. పారమార్థిక గేయాలు, 3. బాంధవ్యగీతాలు. 4. పిల్లల పాటలు, 5 వలపుపాటలు, 6. హాస్యగీతాలు, 7: కన్నీటి పాటలు.

## కథాగేయాలు :

జానపద కవిత్వంలో ఒక భాగమైన కథాగేయాలు పేరే సూచిస్తున్నట్లుగా కథా సహితాలు. కథనం కలిగివుండడం, అనుకరణ సాధ్యమైన సన్నివేశాలనేకం వుండడం.

అజ్ఞాత కర్తృత్వం, పడికట్టువర్ణన లుండడం, అభివర్ధిత పునరుక్తి, పల్లవి (refrian) జనప్రియత్వం మొదలయినవి కథగేయాల లక్షణాలు. లీచ్ సంపాదకత్వంలో వెలువడిన ప్రామాణిక జానపదకోశం ప్రకారం ఐదులక్షణాలు కథాగేయాలలో సార్వత్రికంగా కనిపిస్తాయి. 1. కథాఖ్యానమై ఉండడం, 2. పాటరూపంలో ఉండడం, 3. జనపదీయమై ఉండడం, 4. వ్యక్త్యతీతంగా (impersonal) ఉండడం, 5. ఒక ముఖ్య సంఘటనమీద కథాగేయం కేంద్రీకృతమై ఉండడం.

కథాగేయాలను ఛందస్సునుబట్టి, వస్తువునుబట్టి, కాల ప్రమాణాన్నిబట్టి గాయకులను బట్టి విద్వాంసులనుబట్టి విభజించవచ్చు. వీటిని గానంచేసే కాలప్రమాణాన్నిబట్టి లఘుకథా గేయాలు, కథాగేయాలు, గేయకథాచక్రాలు అని మూడు విభాగాలేర్పడతాయి. గేయ కథాచక్రాలనే జానపద మహాకావ్యం లేక జానపద ఇతిహాసం అనికూడా అంటారు. తెలుగులో పల్నాటి వీరకథ, కాటమరాజుకథ, ఎల్లమ్మకథ మొదలయినవి జానపద మహా కావ్యాలు వివిధ రచయితలు కథాగేయాలలో గుర్తించిన ప్రభేదాలను క్రోడీకరిస్తే ఈ క్రింది కథాగేయ ప్రక్రియలు ఏర్పడతాయి.

1. పౌరాణికాలు, 2. చారిత్రకాలు, 3. పాదమార్థికాలు, 4. శృంగారప్రధానాలు 5. అద్భుత ప్రధానాలు 6 కరుణరసప్రధానాలు, 7. హాస్యరస ప్రధానాలు. 8. పొడుపు కథగేయాలు, 9. గృహసంబంధాలు. ఆయా భాషా విశేషాలనుబట్టి, మూలాంశాలనుబట్టి కథాగేయాలను విభజించడం సమంజసం.

## జానపద కథలు :

మనం జానపద కవిత్వానికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాంకాని ప్రపంచంలో ఎక్కువగా విద్వాంసుల దృష్టిని ఆకర్షించినవి కథలే. మానవుని ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలను గురించి తెలుసుకోవాలంటే కథలు, ఐతిహ్యాలు, పురాణాలు ఎక్కువగా ఉపయోగిస్తాయి జానపద విద్వాంసులు కథల్ని, ఐతిహ్యాలను (legends), పురాణాలను (myths), కలిపి చెప్పేటప్పుడు గద్యకథనాలు (prose narratives) అనే పదాన్ని వాడుతున్నారు కథ అంటే కథనం కలదేకాబట్టి పురాణాలను, ఐతిహ్యాలనుకూడా కథల లోనే అంతర్భూతం చెయ్యవచ్చు.

దేవతలు, రాక్షసులు, ఇతరమానవాతీతశక్తులు పాత్రలుగా ఉండేవి పురాణాలు. మతసంబంధమైన నమ్మకాలు, కర్మకాండలు, ప్రపంచం పుట్టుకనుగూర్చిన అభిప్రాయాలు వీటిలో ఉంటాయి. విజ్ఞాన ప్రపంచానికి అందని ప్రాచీనకాలాన్ని వైజ్ఞానికంగా విశ్లేపించ డానికి పురాణాలు ప్రయత్నిస్తాయి. కొందరు వ్యక్తులు, స్థలాలు, వస్తువులకు సంబంధించిన కథనాలే ఐతిహ్యాలు. ఏనాడో జరిగిందని నమ్మే సన్నివేశాన్ని జానపదులు ఐతిహ్యంగా రూపొందిస్తారు. ఇతర జనప్రియ కథలు మనస్సుకు ఉల్లాసాన్ని కల్గించడానికి ఏర్పడ్డవి.

కట్టుకథలని, కాకమ్మకథలని పేరుపొందిన జానపదకథల్లో విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది. ఇవి ముఖ్యమైన క్రియతో ప్రారంభంకావు, ఉన్నట్టుండి ముగిసిపోవు. వీటిలో మానవులేకాక జంతువులు, దేవతలు, దయ్యాలు, బ్రహ్మరాక్షసులు మొదలైన పాత్రలు కనిపిస్తాయి.

జానపదకథలలో కొన్ని సరళకథలు, మరికొన్ని సంకీర్ణకథలు. ముఖ్యంగా ఈక్రింది కథాప్రక్రియలను గుర్తించవచ్చు.

1. పురాణకథలు (mythological tales) 2. ఐతిహ్యాలు (legends) 3. వినోదకథలు 4. అద్భుతకథలు 5. ప్రాణికథలు 6. సమస్యాత్మక కథలు.

## సామెతలు

ఇవి వివేకయుతమైన, సాంప్రదాయకమైన సంక్షిప్తాభివ్యక్తులు. పలువురిజ్ఞానం ఒక్కని వివేకంగా వెలువడుతుందని, అదే సామెత అని లార్డ్ జాన్‌రసెల్ నిర్వచించాడు. 'అల్పాక్షరాలలో అనల్పార్థం' సామెతల ప్రధానలక్షణత. నాతి దీర్ఘంగా, గంభీరంగా, సూచ్యంగా, అనుభవాన్ని అభివ్యక్తీకరించేవి సామెతలు. సామెతలలో ఒకే వాక్యంగాని, సమతూకం కలిగిన రెండు వాక్యాలుగాని ఉండవచ్చు. ఒకవేళ సమాన భాగాలులేకున్నా ప్రాసానుప్రాసాలతోగూడిన లయ సామెతల్లో కనిపిస్తుంది. ఇవి మానవుని వివేకాన్ని ప్రతిబింబిస్తాయి. అయితే వివేకంతో ఒకమాట చెప్పగానే అది సామెతగా మారిపోదు. అది తగినంత ప్రాచుర్యాన్నిపొంది సంప్రదాయాన్ని గడించుకున్న తర్వాతనే సామెత అనిపించుకుంటుంది.

సామెతల్లో కనిపించే మరొకగుణం తీక్షణంగా ఉండడం. మనిషికి ఉండే దీర్ఘానుభవం ఆధారంగా రూపందాల్చే సంక్షిప్తవాక్యాలు కావడంచేత సామెతలుచెప్పే విషయాన్ని సూటిగా చెప్తాయి.

సామెతల్లో ఎన్నో రకాలున్నాయి. ఏదో ఒక సత్యాన్నిచెప్పేవి కొన్ని, అనుభవాన్ని చెప్పేవి కొన్ని, కథలను సూచించేవి, పాతకాలపు సంప్రదాయాలను సూచించేవి కొన్ని, సామెతలకు అనుకరణలుగా పుట్టేవి కొన్ని, పోలికలనుచెప్పేవి మరికొన్ని, ఇలాగే వైద్య సంబంధమైన సామెతలు, వాతావరణానికి సంబంధించిన సామెతలు, న్యాయశాస్త్రానికి సంబంధించినవి, సామాన్యజనన్యాయాన్ని తెలిపేవి మరికొన్ని రకాలు. ప్రతి భాషలోని ప్రతి సామెతా ప్రత్యేకమైనదే. ప్రతి సామెతకూ ఏదో ఒక విశిష్టగుణం ఉంటుంది, దానివెనుక అపారమైన అనుభవం దాగివుంటుంది.

## పొడుపు కథలు

పొడుపుకథ వైవిధ్యంగల జానపదప్రక్రియ. వాగ్రూపమైన పొడుపుకథలేకాక చిత్రరూపంలో, భంగిమలరూపంలో, గణితరూపంలో కూడా ఉండవచ్చు గేయరూపంలో

ఉండే పొడుపుకథలు మనకు సుపరిచితాలు. కథాగేయాల రూపంలో పొడుపుకథలున్నాయి (riddle ballads), గద్యకథల రూపంలో ఉన్నాయి, సామెతలరూపంలో కూడా ఉన్నాయి.

వినోదాన్ని విజ్ఞానాన్ని సమపాళ్ళలో కలిగించే విశిష్టప్రక్రియ పొడుపుకథ. జీవితమే ఆకారంగా, జీవితంలో సమస్యల్ని విడగొట్టడానికి మనిషిచేసే ప్రయత్నమే ప్రేరణగా ఎదుటివాడి బుద్ధికుశలతకు పరీక్షగా అవతరించేవి పొడుపుకథలు. గాఢీర్యం పొడుపుకథకు మొదటి లక్షణం ఊహకందనట్లు కన్పించి, గూఢంగాఉండే అర్థం తెలియ గానే విన్నవాడు దిగ్భ్రాంతిచెందేట్లు చేయడం పొడుపుకథ వంతు. ఇవి వ్యాజోక్తులు లేక గూఢోక్తులు. పదగూఢత, భావగూఢత, వస్తుగూఢత, అన్వయగూఢత మొదలైనవి పొడుపుకథలో కన్పిస్తాయి.

పొడుపుకథల్లో ఉపమానం, ఉపమేయం ఉంటాయి ఉపమానం వాచ్యంగాను, ఉపమేయం సూచ్యంగాను ఉంటాయి. ఉపమానాల సహాయంతో ఉపమేయాన్ని తెలుసుకో వలసి ఉంటుంది. పొడుపుకథల్లో హాస్యగుణంకూడా ఉంటుంది. కొన్ని అశ్లీలంగాకూడా కనిపిస్తాయి. అయితే అర్థం గంభీరంగా ఉంటుంది. హాస్యమూ, గాంభీర్యమూ రెండూ విచిత్రంగా సంగమించిన గూఢోక్తులు పొడుపుకథలు. ప్రకృతితో సంబంధాన్ని కలిగి వుండడంకూడా వీటిలో కనిపిస్తుంది. వీటిలో ప్రకృతికి సంబంధించిన అనేక వస్తువులు ఉపమానాలుగానో, ఉపమేయాలుగానో ఉంటాయి. మొత్తంమీద పొడుపుకథ ప్రాచీన మానవుని బౌద్ధికసృష్టి అని చెప్పవచ్చు.

పొడుపుకథలో మతసంబంధమైన ఆచరణలకు సంబంధించినవి కొన్ని ఉన్నాయి. ప్రశ్నోత్తరరూపంలో కనిపించే సమస్యలు మరొకరకం. మనుష్యులను గూర్చినవి, జంతువులను గూర్చినవి, వృక్షాదులకు సంబంధించినవి, వస్తువులతో పోలికకల్గినవి వగైరా విభాగాలు పొడుపుకథల్లో ఉన్నాయి.

పైన సంక్షిప్తంగా వివరించిన గేయం, కథాగేయం, కథ, సామెత, పొడుపుకథ అన్నవి దేశవిదేశాలలో శాస్త్రీయ దృష్టితో జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేసేవారు సాహిత్యప్రక్రియలుగా గుర్తించినవి. ఇప్పటివరకు చెప్పిన విషయాలు ఒక్క భాషకు, ఒక్క ప్రాంతానికి, దేశానికి, జనసముదాయానికి సంబంధించినవికావు; ప్రపంచంలో నలుమూలలా జరుగుతున్న పరిశోధన; పరిశీలనలను దృష్టిలోఉంచుకొని జానపద సాహి త్యాన్ని అధ్యయనంచేయడానికి ముందు తెలుసుకోవలసిన కొన్ని విషయాలు. అంధ్రుల కంటూ ఒక జానపద సాహిత్యం ఉంది, దానిలో ఎన్నో సొగసులున్నాయి. దానివల్ల ఎంతో ప్రయోజనం ఉంది. ఈ విషయాలనుకూడా మనం ఈ సందర్భంలో కొంతవరకు తెలుసుకోవలసి ఉంది.

# ఆంధ్ర జానపదులు

ఆంధ్రులంటే ఎవరు, ఎక్కడనుంచి వచ్చారు, ఎప్పుడు వచ్చారు, ఎందుకువచ్చారు వగైరా ప్రశ్నలన్నీ వేసుకొని విద్వాంసులనేకులు సమాధానాలు చెప్పారు ఆంధ్రులెవరైనా, నేడుమాత్రం తెలుగువారు. ఆంధ్రజానపదులు ఒక ప్రత్యేక సంస్కృతి, సంప్రదాయం కలవారు. ఆంధ్రప్రదేశ్ మొత్తం జనాభాలో గ్రామీణులు సుమారు 80 శాతం ఉన్నారు. అనేక శతాబ్దులనుంచి తమ ఆలవాట్లను, అభిరుచులను. సంప్రదాయాలను కాపాడుకుంటూ వస్తున్న గిరిజనులు ఆంధ్రప్రదేశ్‌లో పదిహేడు లక్షలకు పైగా ఉన్నారు.

ఆంధ్రజానపదుల ప్రధానవృత్తి వ్యవసాయం. మన రాష్ట్రంలోని శ్రామికులలో 32 శాతం వ్యవసాయదారులు, 38 శాతం వ్యవసాయ కార్మికులు, మిగిలినవారు ఇతర శ్రామికులు. మొత్తం ఆంధ్రులలో 29 శాతం వ్యవసాయం మీదనే ఆధారపడి ఉన్నారు. మిగిలిన వృత్తులను చేపట్టినవారు 12 శాతం మాత్రమే.

ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిజాతులను గురించి ప్రాచీన కావ్యాలలోకూడా ఉల్లేఖనాలు కన్పిస్తాయి. చెంచు, కోయ, కొండదొర, కొండరెడ్డి, మన్నెదొర, రెడ్డిదొర, సవర, యానాది, ఎరుకుల, గోడు, వాల్మీకి మొదలైన ఆదివాసులు కొండల్లో, ఆడవుల్లో, పల్లపు భూముల్లో కొందరు స్థిరనివాసాన్ని ఏర్పరచుకొని, మరికొందరు దేశద్రిమ్మరులుగా జీవిస్తున్నారు.

ఆంధ్రదేశంలోని గిరిజనుల సంఖ్యలో విశాఖజిల్లాకు అగ్రస్థానం లభిస్తుంది. ఈ జిల్లాలో సుమారు మూడు లక్షలమంది, శ్రీకాకుళం జిల్లాలో రెండులక్షలకుపైగా గిరిజనులు న్నారు. గిరిజనులుకాక ఇతర కులాలు వారిలో ఉపశాఖలు ఆంధ్రదేశంలో లెక్కకు మిక్కుటంగా ఉన్నాయి నాగులపాటి శాసనంలో 18 కులాలు పేర్కొనబడ్డాయి. కోమట్లు, ఈదురవారు, గొల్లవారు, అక్కలవారు, సాలెవారు మొదలైన వారిని ఈ శాసనంలో పేర్కొనడం జరిగింది. ఈ కులాల్లో చాలావరకు వృత్తివల్ల ఏర్పడ్డవి, కొన్ని మత సంబంధమైనవి.

బ్రాహ్మణ, వైశ్య, రెడ్డి మొదలైన కులాలకు చెందినవారు సమాజంలో మంచి స్థితిగతులుండేవారు. ఇలాంటి నాగరిక జాతులలాగా ఔన్నత్యాన్ని పొందకుండా; ఆదవాసుల లాగా మరీ అట్టడుగున ఉండకుండా దేశద్రిమ్మరులై జానపద సాహిత్యమే జీవనోపాధిగా తిరిగే జానపద భిక్షకగాయకులు అనేకులున్నారు. వీరిని గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది.

జానపద వృత్తిగాయకులు : ప్రపంచాద్యంతమూ వృత్తిగాయకులున్నారు. వీళ్ళలో రెండురకాలు : 1. ప్రజల్లో కొంతస్థితిపరులైన కులాలను ఆశ్రయించి కులకీర్తనం చేసి

పొట్టపోసుకునేవారు. బ్రాహ్మణులకు విప్రవినోదులు, క్షత్రియులకు భట్రాజులు, వైశ్యులకు వీరముష్టులు, ఇతరులకు పిచ్చుకుంట్లు ఆశ్రితులయ్యారు. 2. తరతరాలనుంచి జానపద కవిత్వగానంతో జీవనం సాగించే గాయకభిక్షకులు. వీరు దేశద్రిమ్మరులు.

తెలుగు వృత్తిగాయకులలో కొందరు చుట్టుప్రక్కల ఉండే రాష్ట్రాలలోకూడా ప్రవేశించి అక్కడి పాటలను, కథాగేయాలను నేర్చుకుని పొట్టపోసుకుంటున్నారు. ఇటువంటివారిలో ప్రముఖంగా పేర్కొనదగినవారు పిచ్చుకుంట్లు. పాల్కురికి సోమనాథుని కాలంనుంచి వీరు వికలాంగులని చెప్పబడుతున్నారు. ఇదే అర్థంలో కన్నడంలో వీరిని 'హెళవరు' అంటారు. పిచ్చుకుంట్లకు గంట తిత్తి వాద్యాలు. వీరు రెడ్లను, యాదవులను యాచించి జీవిస్తారు. శ్రీశైల మల్లికార్జునుని భక్తులయిన పిచ్చుకుంట్లు ఎల్ల నాగిరెడ్డి కథ, వేమారెడ్డికథ, కుంటిమల్లారెడ్డికథ మొదలయినవాటిని గానం చేస్తారు. కన్నడదేశంలోని హెళవరుకూడా శ్రీశైల మల్లికార్జునుని భక్తులే. వీరూ తమ వంశంలోని కుంటితనాన్ని గురించి రకరకాల కథలు చెప్తారు.

తెలుగులోనేకాక ప్రపంచంలోని జానపద మహాకావ్యాలలోనే అత్యంత ప్రశస్తమైనదిగా కీర్తింపదగింది పల్నాటి వీరచరిత్ర. దీన్ని వీరవిద్యావంతులు లేక పల్నాటివారు పాడుతారు. వీరు హరిజనులు. వీరజోడు, గదిటలు, తిత్తి, తాళం, కత్తి, డాలు ఉపయోగిస్తారు. బలిజలు బొబ్బిలికథ, బాలనాగమ్మ, మరాటీలకథ, చిన్నమ్మకథ, కామమ్మకథ మొదలయినవి గానం చేస్తారు. వీరు 'బణజిగరు' అనే పేరుతో కన్నడదేశంలోకూడా ఉన్నారు.

మత సంబంధమయిన గాయకబృందాలుకూడా ఉన్నాయి. దాసరులు, వైష్ణవులు. వీరిలో బుక్కదాసరి, పాగదాసరి, భాగవతదాసరి, చిన్నదాసరి, దండెదాసరి, మాలదాసరి మొదలయిన ఉపజాతులున్నాయి. వీరు శంఖు, తంబురా, చిరుతలు పలికిస్తూ విష్ణునామ సంకీర్తన చేస్తూ భిక్షమడుగుతారు. కన్నడ దేశంలోకూడా 'దొంబిదాసరు' అనే పేరుతో తెలుగు మాతృభాషగాగల నాయకులున్నారు తెలుగుదేశంలోని జానపద గాయకులలో జంగాలుకూడా పేర్కొనదగినవారు. తెలుగులోని వీరగాథల్లో సగానికిసగం జంగాలే పాడుతున్నారు. బొబ్బిలివరుసలో వుండే కథలతోబాటు పద్యాలను, కీర్తనల్ని చేర్చి యక్షగాన ధోరణిలో జంగంకథలను రూపొందించారు జంగములు. మొదటమొదట వీరు శైవసంబంధమైన కథలనుమాత్రం చెప్పేవారు తర్వాత శైవేతర కథలకుకూడా అలవాటు పడ్డారు. వీరముష్టివారుకూడా వీరశైవులే జేగంట లేదా తప్పెట వాయిస్తూ కోరుట్లను, జంగాలను యాచించే వీరముష్టివారు కన్యకాపరమేశ్వరిని గురించిన పాటలను పాడుతుంటారు.

శారదకాండ్రు తెలంగాణాలో ప్రసిద్ధులయిన జానపద గాయకులు. వీళ్లూ శైవులే. శారదవరుస పాటలను, చారిత్రక గేయాలు కొన్నిటిని వీరు గానం చేస్తారు. సర్వాయి

పాపడు, సదాశివరెడ్డి మొదలైన కథల్ని తెలంగాణాలో ప్రసిద్ధం చేసిందివీరే. ఒగ్గుఅనే వాద్యంవల్ల ఒగ్గోళ్ళు అనే గాయకజాతి ఏర్పడింది. బీరన్నను ఆరాధిస్తారు కాబట్టి వీరికి బీరన్నలవారనికూడా పేరు. ఒగ్గు, వీరణాలు, తప్పెటలు ఉపయోగిస్తూ కొమిరెల్లి మల్లన్నకథ మొదలైనవి చెప్తారు బీరన్నలవారు.

బవనీలను గురించి ప్రాచీనకాలంనుంచి సాహిత్యంలో ఉల్లేఖనాలున్నాయి. బైండ్ల వారని, పంబలవారని పిలువబడే ఈ గాయకులు ఎల్లమ్మ, పోచమ్మ, అంకమ్మ వంటి గ్రామదేవతల్ని కొలుస్తారు. జమిడిక వీరి ప్రధాన వాద్యం. కాటమరాజుకథను, కృష్ణలీలలవంటి వైష్ణవ కథల్ని చెప్పేవారు గొల్లసుద్దులు. కొమ్ములు,వీరణాలు, శంఖాలు వీరి వాద్యాలు. ఇంకా సాతానులు, బాలసంతువారు, బుడబుక్కలవారు, జోగులు మొదలైన జానపద భిక్షుకులు జానపదకళలను వందలాది ఏళ్ళనుంచి కాపాడుతున్నారు. వారికి అవి ఇంకా వృత్తి విద్యలుగానే ఉన్నాయి. ఒక విధంగా ఈ బీరగాయకులకు జానపదగేయ ప్రచారమే స్వయం ఉపాధిపథకం.

## జానపద సాహిత్యం - అందచందాలు

తెలుగు జానపద సాహిత్యంలో ఎన్నో అందాలు, మరెన్నో చందాలున్నాయి. ఈ అంద చందాలను కేవలం సౌందర్య దృష్టితోమాత్రమే కాక సాంస్కృతికదృష్టితో, జీవితంలో వాటిపాత్రదృష్టితో చూడవలసిఉంది. నిజానికి ఒక్కొక్క గేయం, కథాగేయం, కథ, సామెత, పొడుపుకథ సూక్ష్మంగా పరిశీలిస్తే ఒక్కొక్క పరిశోధన వ్యాసానికి తగినంత సమాచారాన్నందిస్తాయి. వీటిలో ఒక్కో పదానికి వెనక ఎంతో జీవితానుభవం దాగి ఉంటుంది. తెలుగు జానపద సాహిత్యంలోని అందాలను, చందాలను తరచిచూస్తే తెలుగువారి సంస్కృతిని అర్థం చేసుకోవచ్చు.

## గేయాలు

తెలుగు జానపద గేయాలలో పనిపాటలకు అగ్రస్థానం. వీటినే కొందరు శ్రామికగేయాలన్నారు. పని చేస్తూ పాడే పాటలకు 'పనిపాటల' కంటే మంచిపేరు లేదు. స్త్రీలైనా, పురుషులైనా, పిల్లలైనా, దంచేటప్పుడైనా, విసరేటప్పుడైనా, నాట్లు వేస్తూ, కోతలుకోస్తూ, రాళ్ళుకొడ్తూ, మోతలు మోస్తూ పాడేవైనా, ఏ పాటైనా పనిపాటే. 'శ్రామికుల'నేసరికి ఏదో పరిమితార్థం స్ఫురిస్తుంది.

పనిపాటల్లో కర్షకగేయాలది ప్రముఖశాఖ. ఈ పొలంపాటల్లో వానపాటలు, ఏరువాక పాటలు, ఏతాం పాటలు, కలుపు, కోత, కుప్పనూర్పిడి మొదలైన పాటలున్నాయి. కపిల పాటలు అల్పాక్షరాలలో అనంతార్థాలను దాచుకొని ఉన్నాయి.

మానుమాను పువ్వుగాచె మానికిందరాసి పోసె
ఇప్పిమాను పువ్వుగాచే ఇప్పుడిరిగె నా మనసు

ప్రకృతి పరిణామాన్ని చక్కగా పరిశీలించే కవి మాత్రమే ఇలాంటి పాట కట్టగలడు భాషాశాస్త్రంలోని శైలిశాస్త్రం ప్రస్తుతం దినదినాభివృద్ధి చెందుతున్నది. శైలీ శాస్త్రదృష్టితోచూస్తే పై గేయంలో జానపదకవి చూపిన దిట్టతనం, అనుభవం విస్మయం కలిగిస్తుంది. 'మానుమాను పువ్వుగాచె' అనడంలో వసంతకాలంలో మానుమాన్నూ పూలుపూచిన సమృద్ధిని చక్కగా సూచించడం జరిగింది. మాని కింద రాసిపోయడం వల్ల ఈ పుష్పసమృద్ధిని మరింతగా ఒత్తిపల్కడం జరిగింది. విప్పమాను పువ్వుగాయడం వసంతకాలం చివర జరుగుతుంది. ఇది జానపదుడికి బాగాతెలుసు అందువల్ల 'ఇప్పిమాను పువ్వుగాచె' అని దానివల్ల విరిగిన మనసుకు కారణాన్ని కల్పించాడు. అయితే వసంతకాలం ముగింపుకు వచ్చిందని వాచ్యంగా చెప్పలేదు. విరహగీతాలలో అత్యుత్తమైన ఈ కపిల పాటను రాసినవాడు లేక చెప్పినవాడు ప్రతిభాసంపన్నుడంటే అతిశయోక్తి కాదు.

అనుభవం, అభివ్యక్తి అన్నవి శిష్టకవులకు ఎలా అవసరమో జానపదకవులకు అంతే అవసరమవుతాయి. పుస్తకపాండిత్యం లేకపోయినా లోకజ్ఞానం అపారంగా కలిగి వుండడంవల్ల జానపదకవికూడా అనుభవంతో తలపండినవాడే. అతని అభివ్యక్తిలోకూడా ఒక నియమం ఉంది. ప్రాచుర్యంపొందడానికి తగిన శైలివిన్యాసం ఉంది. అటురచనల్లోని పొందిక ఉంది. అనుభవాలను సరళమైన ఉపమానాలద్వారా అభివ్యక్తీకరించే పద్ధతికి ఈక్రింది కపిలపాట మంచి ఉదాహరణ.

ఈతమాను ఇల్లుకాదు, తాటిమాను తావుకాదు
తగిలినోడు మొగుడుకాదు, తగరు బంగారుకాదు.

పనిలోని కష్టం తెలియకుండా చేస్తాయి పనిపాటలు. ఆడుతూపాడుతూ పనిచేస్తే కష్టం తెలియదనే స్పృహ జానపదులకుంది. సార్థకమైన ఉపమానాల బలంతో చెప్పవలసిన విషయాన్ని అందంగా చెప్పవచ్చు. ఈక్రింది రోకటిపాట అలాంటిదే.

దంపుదంపనియేరు అదియెంతదంపు
ధాన్యరాశుల మీద చెయ్యేసినట్లు
వంటవంటనియేరు అదియెంతవంట
వదినెతో మరదళ్ళు వాదాడినట్లు.

పనిపాటల్లోనేకాక పారమార్థికగేయాలలో కూడా ఆంధ్రులసంబంధబాంధవ్యాలు, కుటుంబ జీవనంలోని రీతినీతులు చోటుచేసుకుని ఉంటాయి. మేలుకొలుపులు సీతమ్మను గురించి ఉన్నా అవి ప్రతి ఇంటి ఆడబడుచుకూ వర్తిస్తాయి.

అత్తమామ మరదులు తోటికోడళ్ళు
అపుడె లేచున్నారు లేవమ్మా
అదియేమో మాయమ్మ అలసి నిద్రించేవు
అత్తవారిల్లిది లేవమ్మా - తెల్లవారవచ్చెనూ—

అన్నపాటలో అవిభక్త కుటుంబంలో గృహిణి పాత్ర ఏమటన్నది జానపదుని నోటివెంట పాటగా వెలువడింది. తల్లికి స్త్రీ హృదయంలో ఉండే స్థానమేమిటని జానపద గేయాల వల్ల చక్కగా తెలుస్తుంది. మనది పితృప్రధానసమాజం. కూతురు అత్తవారింటికి వెళ్ళవలసి వస్తుంది. ఈ విధమైన వ్యవస్థలో పుట్టినింటిని గురించిన పాటలు స్త్రీ నోట వెలువడడం సహజమే. పుట్టింటికి వెల్దామనుకున్న మగువకు కాళ్ళురథాలై నడుస్తాయి, చేతులుయ్యాల చేరులై ఊగుతాయి.

కాశికెడదామంటె కదలవే కాళ్ళు
ఢిల్లికెడదామంటె తిరగదే మనసు
నా రాచపుట్టింటి కెళదాము అంటె
నా కాళ్ళు పన్నిన్న రథములై నడచు
నా చేతులుయ్యాల చేరులై యూగు

ఉయ్యాల చేరుల్లాగా చేతులూగే ఉపమానం బిడ్డనుగన్నతల్లి మాత్రమే చెప్పగలదు ఇదొక అపూర్వమైన, మనోహరమైన ఉపమానం. భారతీయ సమాజంలో స్త్రీస్థానం అత్యున్నతమైనదన్న దాంట్లో 50 శాతం మాత్రమే నిజం ఉంది. ఎన్నో విషయాలలో స్త్రీ అనుభవించే వేదన అలవికానిది. బాధలగాధలను హృదయాన్ని కదిలించే గేయంగా మలిచేశక్తి జానపదులకుంది. డా. బి. రామరాజుగారు "తెలంగాణా జానపదగేయాల"లో ఉదాహరించిన ఒక గేయభాగం ఇలా ఉంది:

'మానన్న గానైతి మంచె వేతూరు
చెట్టన్నగానైతి చెలగివేతూరు
ఆకన్నగానైతి మేక లారగించు
కాయన్నగానైతి కాకులారగించు
పండన్న ˙ నైతి పక్షులారగించు
బలుడు మా తండ్రి పాలుబిండంగ
బంగారు చెంబులో ధారగానైతి
సిరిదేవి మాయమ్మ చల్లచేయంగ
చిల్లిపోయి కవ్వాన చితుపగానైతి'

వేదనవల్ల కలిగిన వైరాగ్యాన్ని ఇంతకన్న చక్కగా వ్యక్తం చెయ్యటానికి వీలుకాదు కుటుంబజీవనంలో వివిధ బాంధవ్యాలను తెలిపే బాంధవ్యగీతాలు నిత్యజీవితం లోని వెలుగునీడలకు అద్దం పడతాయి.

లాలులు, జోలలు, పిల్లలపాటలు ప్రపంచాద్యంతమూ కనిపిస్తాయి. "ఏడవకు ఏడవకు నా చిట్టితండ్రి" ఏడిస్తే నీకళ్ళ నీలాలుగారు"నని తల్లిపాడేలాలి మాతృహృద యానికి అద్దం పడుతుంది. శిశుప్రాసలలోని లయ పసిపిల్లల్ని లోగొంటుంది. జ్ఞాపకశక్తిని పదజ్ఞానాన్ని పెంపొందించే శిశుప్రాసలవల్ల పసివారికి చాలా మేలు జరుగుతుంది.

పిట్టమ్మపిట్ట. ఏమిపిట్ట, చిలక పిట్ట
ఏమి చిలక, తెలుపు చిలక, ఏమి తెలుపు
హంస తెలుపు, ఏమి హంస. రాజహంస..........

వంటి ప్రాసలు పదనిర్మాణశక్తిని పెంపొందిస్తాయి.

తెలుగువారికి ఎన్నో వేడుకలున్నాయి. వాటిలో ముఖ్యమైన వేడుక వివాహమే. ఆంధ్రుల పెళ్ళిసంబరాల వివరాలన్నీ పలురకాల పాటలలో నిక్షిప్తాలై ఉన్నాయి.

పిలిపించు నీ సీత పిలుపు చూతాము......

అని పెళ్ళివారు అడిగితే—

పిలుపేమి సూసేవు చిలుక పలుకుల్లా

అని గడుసుగా చెప్తారు జవాబు జానపదులు.

పిలుపించు నీ సీత నడకచూతాము......

అనగానే—

నడకేమి సూసేవు అంస నడకల్లా.

అంటారు ఇలాంటి గడసరిదనం అనేక గేయాలలో వ్యక్తమవుతుంది తలంబ్రాలను వర్ణిస్తూ ఒకజానపద కవి-

పులపుల వానొచ్చె పులు మొగ్గబొడిగె
రవరవ గాలిసరె రాలె మల్లెల్లు

అని ఏ ముహూర్తంలో అన్నాడోగాని అతని పద చిత్రాన్ని అత్యంత మనోజ్ఞ కవితా ఖండికగా పేర్కొనవచ్చు.

ప్రియురాలి మనోభావాలను అత్యంత మనోహరంగా చిత్రించే గీతాలలో 'చల్ మోహనరంగా' పాట ముఖ్యమైంది.

కంటికి కాటుకబెట్టి కడవ చంకానుబెట్టి
కళ్ళ నీళ్ళు కడవ నిండెను గదరా
చల్ మోహనరంగా
కళ్ళనీళ్ళు కడవ నిండెను గదరా

అని మొదలయ్యే ఈ పాటలో ఇలాంటి గీతభాగాలు 55 ఉన్నాయి. వెనకటి పుటల్లో చెప్పినట్లు జానపద విజ్ఞానం సమాజం నిషేధించేవాటికి ఆశ్రయం ఇస్తుంది. జారిణికి సభ్యసమాజంలో స్థానంలేదు కాని వలపుపాటలలో ముఖ్యమైన స్థానమే ఉంది. కోలారుజిల్లాకు చెందిన ఈ క్రింది 'బోగం' పాటలో ప్రాయంవచ్చే విషయాన్ని ఎంత చక్కగా కల్పించారు జానపదులు !

నేచిన్నదాన్నిరా నెల్లూరు బోగం దాన్నిరా
కాలకురుసాదాన్నిరా కల్లూరు బోగందాన్నిరా
నేను చిన్నాపాయమపుడు
చింతచెట్టు పసివుంటే
చింతచెట్టు చిగురుకొచ్చె
చిన్నబిడ్డ తల్లినైతి
రాగిచెట్టు రచ్చకొచ్చె
రాజులేలే పాయమాయె

జానపద గేయాల్లో శృంగారం, హాస్యం శిష్టకావ్యాలలోలాగా విభానుభావ వ్యభిచారి భావాలతో నిష్పన్నం కాకున్నా వినేవాడి హృదయాన్ని కదిలేట్లు చేయగలిగిన శక్తి దానికుంది. జానపదుల వలపుల గుబాళింపు, హాస్యోక్తులసొంపు సరళమైనదేగాని, సుమధుర మైందికూడా. "ఆలోచించే మనిషికి జీవితం హాస్యరూపకం, స్పందించే మనిషికి విషాద రూపకం'' అన్న హొరేశ్ వాల్‌పోల్ మాటల్లో సత్యముంది, ఆలోచించడమూ, స్పందించ డమూ సమపాళ్ళలో ఉండబట్టే జానపదులు హాస్యానికీ, శోకానికి సమప్రాధాన్యమే ఇచ్చారు. పనిపాటల్లో, వేడుకపాటల్లో, వలపుపాటల్లో హాస్యంకనిపిస్తుంది. కొన్ని పారమార్థిక గేయాలలోకూడా అక్కడక్కడ హాస్యదృష్టి ఉండనే ఉంటుంది. వేడుక పాటల్లో బువ్వపుబంతి పాటలు, వియ్యపురాలిపాటలు మొదలయినవి వినోదంకోసం రూపు దాల్చినవి. ఆడపెళ్ళివారి దృష్టిలో వియ్యపురాలి చిత్రణ వికృతంగానే ఉంటుంది.

వెండిపళ్ల వెండి ఆకు విడిదికి పంపితిమి
పారపళ్ళ వియ్యపురాలు పళ్ళేతోమదుగా
సన్నజాజులు మల్లెమొగ్గలు విడిదికె పంపితిమి

బట్టతల వియ్యాపురాలు పూతే ముడువదుగా
బనారసు చీర రవిక విడిదికి పంపితిమి
అబ్బబ్బ ఇవిఅన్నీ మాకలవాటు లేదనిరి
హారతికర్పూర దండలు విడిదికి పంపితిమి
కొండమెడ వియ్యాపురాలు దండే వెయ్యదుగా
తమలపాకులు వక్కాలు మేము విడిదికి పంపితిమి
కుక్కపళ్ళ వియ్యాపురాలు ఆకే వేయదుగా
వివరామెరుగని వియ్యాపురాలికి విడుదులు చూపితిమి
వివరామెరుగని వియ్యాపురాలు విడిదిలో ఉండదుగా.

హాస్యాన్ని జానపదులెంతగా కోరుకుంటారో శోకాన్నికూడా అంతే సహజంగా భావిస్తారు. సుఖదుఃఖాలన్నవి మానవ జీవితంలో అనివార్యమైన సమతూకాలన్నది లోక జ్ఞానం ఉన్న జానపదులకు బాగా ఎరుకే. అప్పగింతల పాటలు కన్నీటిబుగ్గలు. పెళ్ళంతా సరదాగా గడుస్తుంది. చివర అప్పగింతలు ఎంతటి కఠినాత్ముని కైనా కంటతడి పెట్టిస్తాయి. ఒక్క అప్పగింతపాట మాత్రం వినోదంకోసం ఏర్పడినట్లుగా తోస్తుంది. ఇలాంటివి అరుదయిన ఉదాహరణలు.

'అత్త మామలుగాని ఆడబిడ్డలుగాని
లేరమ్మా నీదెంత పున్నెమోగాని
మగడు ఒక్కడుగాన మనసుకెక్కినయట్లు
మర్దించి నీ వశము చేసుకోవమ్మా'

ఇది అప్పగింతల పాటల్లో అపవాదం బహుశా అప్పగింతల సమయంలో పాడేది కాదు. ఈ క్రిందిది అసలయిన అప్పగింతలపాట. ఇది ఒక విధంగా చాలా విశిష్టమైన పాట; కోలారుజిల్లా తెలుగుపాట.

ఆరెకరాల్ చేనిస్తా అంటిమామిడి తోపిస్తా
పోయమ్మా నా కూతురా
పోయింటికి కీర్తి తేవమ్మా
ఆరెకరాల్ చేనిస్తా ఆవులప్పని నీ జతకిస్తా
పోయమ్మా నాకూతురా
పోయూరికి కీర్తి తేవమ్మా.
పోనమ్మా నేను పోనమ్మా

పోతే తిరుగుట లేదమ్మా
ఆరుమంది అన్నగార్లూ
కడగొట్టోడే గంగులప్ప
వానికి నాకు కాదమ్మా
పోనమ్మా నేను పోనమ్మా
పోతే తిరుగుట లేదమ్మా
ఏడుమంది అక్క సెల్లెళ్ళు
కడగొట్టుది కమలమ్మ
దానికి నాకూ కాదమ్మా
పోనమ్మా నేను పోనమ్మా.......

పుట్టినింటి నుంచి కదలడానికి ఇష్టంలేని కూతురి ఆవేదన ఈ పాటలో వ్యక్తమవుతుంది. దానికి కారణాలనూ ఆమె చెప్తున్నది. కాని అత్తవారింటికి పంపితీరవలసిన బాధ్యత తల్లిది. ఎందుకంటే కూతురు అత్తవారింటికి వెళ్తే ఇంటికి కీర్తివస్తుంది. అయితే గ్రామీణ జీవనంలో ఏ ఇంటికా యిల్లు ప్రత్యేక అస్తిత్వం కలదికాదు. సామాజికస్పృహ అన్నది గ్రామీణులు తెచ్చిపెట్టుకోనవసరం లేదు. సహజంగానే లభిస్తుందది. అందుచేత పై పాటలో తల్లి 'ఇంటికి కీర్తి తేవమ్మా' అనిచెప్పి అంతటితో ఊరుకోక 'ఊరికి కీర్తి తేవమ్మా' అన్నది.

అప్పగింతల పాటలేగాక కొన్ని దుర్ఘటనలుకూడా కన్నీటిపాటల ఆవిర్భావానికి కారణం కావచ్చు. స్మృతికావ్యం ఆధునిక కాలానికి చెందిందైనా, జానపద గేయాల్లో కొన్ని అపూర్వ భావవిలసితాలైన స్మృతికవితలున్నాయి,

సుద్దిబొందలకాడ నీ సుద్దిదియ్యంగానె
సద్దిదిన్నట్టాయెనే సిలకా-సిన్నారి సిలకా......

అన్న ప్రసిద్ధగీతం ఇలాంటివాటిలో ఒకటి. కన్నీటి పాటలలో శిఖరప్రాయమైన ఈ క్రింది గీతం ఎవరి హృదయాన్నయినా కదిలిస్తుంది. సావాసగాడు చనిపోగా బాలిక విలపిస్తున్నది, పసిపిల్లలకు సహజమైన సుమధుర మృదుభావాలు హృదయస్పర్శగా కూర్చబడ్డాయి, ఈ పాటలో :

'బొంగురాలాడేటి బొగుడల్లా నాయిరాజా
యాడలెంకిన (వెదకిన) లేడే యెలదారి ,,
చిర్రగోనె లాడేటి చింతల్లా ,,

యాడలెంకిన లేడేటి యెలదారి ,,
గోటీలాడేటి కోనల్లం ,, ॥ యాడ ॥
నిన్న మనమాడిన నిమ్మల్ల ,, ॥ యాడ ॥
మొన్న మనమాడిన మోతుకుల్ల ,, ॥ యాడ ॥
చెండూలు ఆడేటి చెలుకల్ల ,, ॥ యాడ ॥

('త్రివేణి' సంకలనం, పుట 237)

తెలుగు జానపద గేయాలలోని సొగసులు కేవలం సౌందర్యానుభూతిని కలిగించేవి మాత్రమేకాక, సంస్కృతికి అద్దం పట్టాలికూడా. ఒకపాటలో స్త్రీ చెప్తుంది.

నాకు నల్లచీర నెమలివన్నె రవికె
వడినిండ బియ్యాము, పళ్ళూ కొబ్బరిగిన్నె
పసుపుకుంకుమ యిచ్చిపంపె మాయన్న.

ఇందులో మన సమాజంలో అన్నాచెల్లెళ్ళకున్న అనుబంధం ఎలాంటిదని తెలుస్తున్నది, అలంకరణ విశేషాలు, తరతరాల ఆచారాలు, ఆడబడుచు మర్యాదలు మొదలయిన అనేక విషయాలు ఈ మూడు పాదాలద్వారా వ్యక్తమవుతున్నాయి.

## కథాగేయాలు

తెలుగులో కథాగేయాలకు సుమారు వెయ్యిసంవత్సరాల చరిత్రఉంది. నన్నెచోడుని కాలంతో గౌడుగీతాలున్నాయి బహుశా నన్నెచోడుని కాలానికి గౌడుల ఆరాధ్యదైవమైన కాటమయ్యను గురించి కథలు గాథలు ప్రచారంలో ఉండేవేమో! భక్తుల చరితలను పాటలరూపంలో అనాడు పాడేవారని పాల్కురికి సోమనాథుడు చెప్పాడు. శ్రీశైలయాత్ర చేసే సందర్భంలో పిచ్చుకుంట్లు భక్తుల గాథల్ని గానం చేసేవారట. ఏకవీరా మహాదేవి ఎదుటనిల్చి పరశురాముని కథలెల్ల ప్రౌఢిబాడిగ బవనీల చక్రవర్తిని గురించి క్రీడాభిరామ కర్త చెప్పి ఆనాటి జానపద మహాకావ్యాలను పరిచయం చేశాడు. రామాయణ మారుకాండములుకూడా ఆనాడు పాడేవారని చెప్పాడు.

తెలుగు కథాగేయాలలో పౌరాణికాలు, చారిత్రాకాలు, సాంఘికాలు మొదలైనవిభాగాలున్నాయి. పురాణాలు గద్యరూపంలోనూ ఉన్నాయి, పద్యరూపంలోనూ ఉన్నాయి తెలుగు వారికి పురాణాలనగానే రామాయణ మహాభారత భాగవతాలు జ్ఞాపకం వస్తాయి. పురాణం అన్నదాన్ని ఇలాంటి పరిమితార్థంలోకాక, ఒక సమాజంలోని నమ్మకాలకు సంబంధించిన శాస్త్ర విషయంగా తీసుకుంటే అప్పుడు శైవ వైష్ణవ సంబంధమైన గేయాలను కూడా పురాణాలుగానే తీసుకోవాలి. రామాయణపు పాటలు

ఆంధ్రదేశాద్యంతమూ కనిపిస్తాయి. తెలుగులో అన్ని సాహిత్య ప్రక్రియాల్లోనూ రామాయణం ఉంది. వాల్మీకి రామాయంలోలేని అనేకాంశాలు జానపద రామాయణాలలో కనిపిస్తాయి. సీత జననం, సీత సమర్త. సీతా కళ్యాణం, సీత అప్పగింతలు. సీతచెర, సీత అగ్నిప్రవేశం, సీతాదేవి వేవిళ్ళు మొదలైనవి ఒక్క సీతమ్మవారి'కేకాక మొత్తం తెలుగు స్త్రీజాతికి సంబంధించినవి, రామాయణకథను సంక్షిప్తంగా చెప్పే శారద రామాయణం, సంక్షేప రామాయణం, లంకాసారథి మొదలైనవి కూడా ఉన్నాయి. ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవర నవ్వు మొదలైన జానపద మనస్తత్వాన్ని ప్రదర్శించడలో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి, పధ్నాలుగేళ్ళు నిద్రాదేవి ఒడిలోనే మైమరిచి ఉండిన ఊర్మిళ త్యాగ జీవితం మరుపురానిది. లక్ష్మన్న ఊర్మిళను నిద్రనుంచి లేపాలని వెళ్తే భర్తనే గుర్తుపట్ట లేని దయనీయ స్థితిలో ఆ యిల్లాలు ఉంది.

అయ్య మీరెవ్వరయ్యా - మీరింత యాగతమ్ముల కొస్తిరి
సందుగొందులు వెదకుచు మీరింత తప్పచేయగ వస్తిరీ

అన్న ఊర్మిళ మాటలకు ఎవరి హృదయమైనా అర్ద్రమవుతుంది.

లక్ష్మణదేవరనవ్వు ఒక అపూర్వ కల్పన. సరస చమత్కారానికి ఇంతకంటే మంచి ఉదారణ దొరకదు. శ్రీరామపట్టాభిషేక సమయంలో లక్ష్మణుడికి నవ్వువచ్చింది. ఎప్పుడూ వినయంగా తలవంచుకొని తనపని తానుచేసుకొనే లక్ష్మణుడే విరగబడి నవ్వుతుంటే అందరికి ఆశ్చర్యం కలిగింది. రాముడికి ఎంతకోపంవచ్చిందంటే, కత్తిదూసి తమ్ముడిని చంపబోయాడు. లక్ష్మణుడు తన నవ్వుకు కారణం చెప్తూవుంటే ఒకవైపు నవ్వు, మరొకవైపు జాలి కలుగుతుంది, అరణ్యంలో ఉండగా నిద్రాదేవిని లక్ష్మణుడు ఊర్మిళపై ఉసిగొల్పాడు. శ్రీరాముని సేవకు నిద్ర అడ్డువస్తుందన్నదే లక్ష్మణుని ఆలోచన. వనవాసం పూర్తి అయివచ్చిన తర్వాత పట్టాభిషేక సమయంలోకూడా లక్ష్మణుడికి నిద్ర ముంచుకొచ్చింది. పధ్నాలుగేళ్ళుగాలేని నిద్ర ఇప్పుడు వస్తున్నదని లక్ష్మణుడు-

కలకలనవ్వె లక్ష్మణదేవరపుడు
కలతలుపుట్టెను కపులందరికినీ
కిలకిలనవ్వెను లక్ష్మణదేవరపుడు
కిలకిలనవ్వగా ఖిన్నుడయ్యె రాజు

కారణం తెలిసిన తర్వాత రాముడికి ఏడవాలో నవ్వాలో తెలియలేదు. హత్య చెయ్యాలనుకున్నవాడు ఆత్మహత్యకు సిద్ధమయ్యాడు.

భారత భాగవతాలకు సంబంధించిన పాటలుకూడా అంధ్రదేశంలో అసంఖ్యాకంగా దొరుకుతున్నాయి. ధర్మరాజు జూదం, విరాటపర్వం, సుభద్రకల. సుభద్రసారె, నల చరిత్ర మొదలయినవి జానపదుల జీవితాన్ని, అందులోని వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాయి.

రారాజుతో ద్రౌపది పాచికలాడిన సందర్భమొక్క చేచాలు, జానపదుల ముగ్ధ కల్పనావైభవాన్ని చాటడానికి.

రారాజు తనచేత వేసె పాచికలు
పాంచాలి తన కాళ్ళదోసె పాచికలు

ఎంత చక్కని నాటకీయ చిత్రణ!

బాలకృష్ణుని లీలల్ని తెలిపే మధురగీతాలు ఆంధ్రదేశమంతటా ప్రచారంలో ఉన్నాయి. శ్రీకృష్ణ జననమనే పాటను ఒక్కసారైనా వినని తెలుగువారు అరుదు.

కస్తూరిరంగరంగా నాయన్న కావేటి రంగరంగా
శ్రీరంగ రంగరంగా నినుబాసి యెట్లునే మరచుందురా

అని మొదలయ్యే ఈపాటలో ఎన్నో మధురకల్పనలున్నాయి.

శ్రీకృష్ణ జననం తర్వాత—

పొత్తులామీదనపుడు బాలుడు చక్కగా వవళించెను
తన రెండుహస్తములతో దేవకీ బాలుణ్ణి యెత్తుకొనెను
అద్దాలపై వేసుక ఆ బాల చక్కదనమును చూచెను
వసుదేవ పుత్రుడమ్మ యీ బాల వైకుంఠవాసుడమ్మా....
వీపునా వింజామరా నా తండ్రి బొడ్డునా పారిజాతం
అరికాళ్ళ తామరములు అన్నియు వున్నవిక నాదుతండ్రి
నీరూపు నీచక్కనా ఆ బ్రహ్మ యెన్నాళ్ళు వ్రాసె తండ్రి,

పౌరాణిక గేయాలలో గంగాగౌరీ సంవాదం చాలా ప్రసిద్ధం. పాల్కురికి సోమనాథుని కాలంనాటికే శైవసంబంధ గేయాలు ప్రచారంలో ఉండేవి. గంగాగౌరీ సంవాదం వంటివి పౌరాణికాలైనా సామాజిక విషయాలు సమృద్ధిగా వున్నాయి. గంగా-గౌరి తగవులాడుకున్నారు. గంగ అలిగి వెళ్ళింది. ఆమె వెళ్ళిన తెల్లవారే గౌరమ్మకు చెంగు మాసింది. స్నానపానాదులకు నీళ్ళులేక అల్లాడిపోయింది గౌరి. కాని ఆమెదర్పం బుసలు కొట్టింది ఆమె తండ్రి దక్షుడు పాలకావళ్ళు, నేతికావళ్ళు పంపాడు. గౌరి వాటితో స్నానం చేసి చీమలు, దోమలచేత కుట్టించుకుంది. గౌరి అవమానాన్ని ఎలాగో దిగమింగుకుని గంగమ్మ దగ్గరికి వెళ్ళింది. అప్పుడా సవతి—

పచ్చిచేపలు తెచ్చి పందిళ్ళువేసె
యెండుచేపలు దెచ్చి తోరణాల్గట్టె

పెద్దచేపల పంచటరుగు తాకట్టై
కప్పుజచ్చిన నీళ్ళు కళ్ళాప జల్లె.

గంగ-గౌరి ఈ పాటలో అచ్చమైన జానపద స్త్రీలుగా దర్శన మిస్తారు.

చారిత్రక ప్రాధాన్యంగల వీరగాథలు ఏ భాషా సముదాయమైనా గర్వించదగ్గవి. ఐతిహ్యాత్మకాలు, అస్పష్ట చారిత్రకాలు, చారిత్రకాలు అన్న మూడురకాలు వీరగాథల్లో ఉన్నాయి. తెలుగులోని పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ జానపద మహాకావ్యాలు ప్రపంచంలోనే ప్రథమస్థానంలో నిలవగల్గినవి. బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, సర్వాయి పాపడు, చిన్నపరెడ్డి, సదాశివరెడ్డి, కుమారరాముడు తెలుగుప్రజల్ని ఉత్తేజితుల్ని చేసిన వీరగాథలు. పల్నాటి వీరచరిత్ర కావ్యంగా మనకు దొరికేది మహాకవి శ్రీనాథుడుది కాదు, అసలు నమ్మదగింది కాదు. ప్రస్తుతం ముద్రితమైన పల్నాటికావ్యంలోని కథలు అసలు కథకు సంక్షిప్త రూపాలు మాత్రమే. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజుకథ నెలలతరబడి పాడబడే సుదీర్ఘ కావ్యాలు. వీటిలో కల్పనలు, అలంకారాలు, వేషభూషణాలు, యుద్ధ విశేషాలు, రాయబారాలు - ఏవి తీసుకున్నా తెలుగు సంస్కృతిలోని వైవిధ్యాన్ని తెలిపేవే. తరతరాలుగా సమాజంలో సంక్రమిస్తున్న ఆచార సంప్రదాయాల అధ్యయనానికి ఇవి ఎంతో ఉపకరిస్తాయి.

యుద్ధదృశ్యాన్ని కాటమరాజు కథ ఈ విధంగా ప్రదర్శిస్తున్నది :

పగవారి రక్తము పారంగ సాగె
వరుదలై వాగు వడిగోసినట్లు
నెరసుక రక్తంబు నిండియు పారె
మెదడు రక్తంబుపై మెట్టుగాదేలి
కదలంగ సాగెను కాల్వలయందు
పారె రక్తము కృష్ణ బారినయట్లు...
వొరిగడ్డి వాములు వైచిన రీతి
అరటి మ్రాకులు విరిగి అడ్డపడినట్లు
పక్కలు పిక్కలు బాహువుల్ మెడలు
చెక్కులు డొక్కలు చరణ పద్మములు
గిజ్జలు బొజ్జలు కండగుండెలును
నజ్జులై పడివుండు నందునిందనక
కత్తులు నైజాలు గండ్రగొడ్డండ్లు
చెత్త రాలిన రీతి క్షితిమీదనుండు
పుచ్చకాయల రీతి పుఱకలు తెగియు
అచ్చట పడియుండు అఖిలభూపతులు.

తెలుగువారి ధైర్యసాహసాలను ఆత్మాభిమానాన్ని చాటిచెప్పే వీరగాథ బొబ్బిలి కథ, రంగారావు, తాండ్రపాపయ్య ఆంధ్రపౌరుషానికి మచ్చుతునకలు. బొబ్బిలిలో జన్మించిన పశుపక్ష్యాదులు కూడా పౌరుషముకలవే. కోడిపందేలలో 'చావంటేను మీరు భయపడవద్దు' అని చెప్పడమేకాక 'బొబ్బిలియందున పుట్టినావురా బారాకోడీదా' అనడం ఆ గడ్డమీద పుట్టినవారిపౌరుషగుణాన్ని తెలుపుతుంది. 'ముంజేతికి మీసమున్న' రంగారావు పాత్రచిత్రణ వీరయోధుల సాహసగుణమే రూపుదాల్చినట్లుంది.

సంఘంలోని వాస్తవికాంశాలను, కుటుంబ జీవితాన్ని, ప్రణయాదుల్ని సహజంగా చిత్రించే కథాగేయాలనేకం ఉన్నాయి. వెంకయ్య-చంద్రమ్మపాట గేయానికి కథాగేయానికి మధ్యరకానికి చెందింది వెంకయ్య హరిజనుడు చంద్రమ్మ కాపుపడుచు వీరి పవిత్ర ప్రణయాన్ని అత్యద్భుతంగా చిత్రిస్తున్నదీపాట. కులమెన్నక మంచి మనసునే చూశానని, గుణమునే చూశానని చంద్రమ్మ చెప్పడం ఆమె ఉన్నత సంస్కారాన్ని తెలుపుతుంది. గుడిలో ప్రవేశానికి మూఢాచారాలలో మునిగిన సమాజం అనుమతించదని భయపడుతూ వెంకయ్య చెప్పేమాటల్లో అమాయకత్వం ఉట్టిపడుతూ ఉంది.

ఆడనున్నాసామి ఈడనూ ఉన్నాడు
ఈడనున్నా సామినే చంద్రమ్మ
నేను కొలుసుకుందునే చంద్రమ్మ
ఇద్దరమూ కలిసి ఏకముగ నుంటేను
ఏలోడులోకాలు మనకాడనే ఉంటాయి
ఎక్కడికి వెళ్ళవద్దే చంద్రమ్మ
ఇక్కడనే ఉండిపోదామే చంద్రమ్మ

ప్రణయంతోబాటు శోకం, అద్భుతం, హాస్యం మొదలైన రసాలను ప్రతిపాదించే కథాగేయాలు తెలుగులో ఉన్నాయి కరుణరసప్రధాన కథాగేయాలలో కన్యకామ్మవారి కథ ఒకటి. 'కాపుకోడలు కామమ్మ కలియుగాన సాగుమానముచేసిన సచ్చరిత్ర' అని బసవరాజు అప్పారావుగారు ప్రశంసించారు. అత్తవారింట పడరానిపాట్లుబడిన సన్యాసమ్మ కథ సామాజిక సమస్యలతో ఒకదాన్ని తెలియజేస్తున్నది.

పరమాన్నమొండినవేళ సున్నమిస్తాదీ దాలమ్మ
అన్నమొండినవేళ ఆరికజావ యిస్తాదీ దాలమ్మ
కుడుములొండినవేళ తవిటికుడ్డులిస్తాదీ దాలమ్మ
అరిసెలొండినవేళ పొయిరొట్టెలిస్తాదీ దాలమ్మ
కాలుకంకణమేసి యేలుచున్నాదీ దాలమ్మ
చేతికంకణమేసి యేలుచున్నాదీ దాలమ్మ

తెలుగుదేశంలోనేకాక కన్నడదేశంలోనూ బాగా ప్రచారం పొందిన కథాగేయం బాలనాగమ్మ. జానపదులకు చిరపరిచితాలైన మూలాంశాలు వందలకొద్దీ బాలనాగమ్మలో ఉపయోగించబడ్డాయి. నాగేంద్రునిగూర్చిన నమ్మకాలు, సవతితల్లి పక్షపాతదృష్టి, విష ప్రయోగాలు, మందులమాదేవి మాయలు, మాంత్రికుల ఇంద్రజాలాలు మొదలయినవన్నీ ఈ అద్భుత కథాగేయంలో చోటుచేసుకున్నాయి. మాయలపకీరు విభూతిమహిమను ఆద్భుత హాస్యరస సమ్మిళితంగా కవి వర్ణించినతీరు ఈ క్రిందిది :

తలారి రాముడు—

చేతులో విభూతి నలుపుచున్నాడేమి
తలను గట్టిగ అదుముకున్నాడేమి
తలారి రాముని జుట్టులో అమ్మయ్యా
జుట్టులో తొమ్మిదిమంది పుట్టినారు
వారు పుడతానే బువ్వడుగుతారు
బాబూ మాకు ఖుసాదాలుదేర
నాయన మాకు పప్పులు పెట్టుమురా
ఓరి యెక్కడ పిల్లలు, యేడపిల్లలోరి !
పుడుతూనే వీరు బువ్వడుగుతారు
జుట్టులో కొంచెం గులగులపుట్టె రాముడికి
నెత్తిగుడ్డతీసి నేలగొట్టెను
పరుగు పరుగున ఇంటికివస్తుంటె
మూడువందలూ ముందుగ వస్తూరు

పకీరు మళ్ళీ మంత్రించిన విభూతి ఇచ్చి ఈ పిల్లల్ని మాయచేశాడు.

అద్భుతరసప్రధాన గేయాలలో ధర్మాంగద చరిత్ర అనే పాముపాటకూడా ప్రసిద్ధ మయింది. మనుషులకు పాము జన్మించే కథలు చాలా ప్రచారంలోఉన్నాయి. ఈ కథా గేయంలో ధర్మాంగదుడికి నిండుపడగతో రెండునాలుకలతో నాగరాజు పుట్టాడు చిత్రాంగు డని ఆ పాముకే పేరుపెట్టి పెళ్ళికూడా చేశాడు దర్మాంగదుడు. కత్తికి బాషికంకట్టి పెళ్ళిచేసే పద్ధతి ఉండబట్టి ధర్మాంగదుడు ఈ విధంగా చెయ్యడం సాధ్యమయింది. కోడలు ఇంటికి వచ్చింది ఎన్నిరోజులయినా భర్తృదర్శనం కాలేదు. అత్తను అడగ్గా చల్లగా చావుకబురు బయటపెట్టిందామె. నీ భర్త ఫణిరాజు' అన్నది. కోడలికి ఒళ్ళుమండింది—

నీవంటి పాపిష్టి యే లోకమునలేదు
పాముకయి నన్నిటకు పట్టి తెప్పించినావు

ధర్మాంగరాజైన తగదనక యీలాగు
పాపిష్టిపనికేల పాలుపడెనమ్మ

అన్నది. భర్తను తీసుకొని తీర్థయాత్రచేస్తానంది. చేసినపని పాపిష్టిపని అయినా కోడలిని అనుమానిస్తూ అత్త నిందించి మాట్లాడడం చూడండి :

ఈ పేరుపెట్టుకొని యిల్లువెడలుదు విపుడు
పాము నొక బుట్టలో పారంగద్రోలి
వ్యభిచారివై నీవు వర్తించుటకు నిపుడు
ఈ బొంకుబొంకితివి ఇది నిజముకాదు

ఇలాగే అన్నిరకాల సామాజిక సంబంధాలను కథాగేయాలు కథలో భాగంగా తెలియ బరుస్తాయి. ముఖ్యంగా పల్నాటి వీరకథ, కాటమరాజుకథ, ఎల్లమ్మకథ, కుమారరాముని కథ మొదలైనవి జానపద ఇతిహాసాలుగా పెరిగి ఆంధ్రుల సామాజిక జీవితంలో భాగా లయ్యాయి. ఈ ఇతిహాసాలు కేవలకావ్యాలు కావు. వాటిచుట్టూ ఎన్నోకథలు, ఐతిహ్యాలు, పురాణాలు, పూజలు, సంప్రదాయాలు, ఆచారాలు పెనవేసుకుపోయాయి ఈ విధంగా జనజీవనంలోకి చొచ్చుకుపోయిన జానపద ఇతిహాసాలు ఏ జనసముదాయంలోనైనా అరుదుగానే లభిస్తాయి తెలుగులో ఇలాంటివి ఎక్కువగా ఉండడం ఆ ప్రజల సంస్కృతి ఎంత ప్రాచీనమైనదో, ఏంత గాఢమైనదో, వైవిధ్యమయమైనదో తెలుపుతుంది. మొత్తం మీద కథాగేయాలను కేవలం సాహిత్యదృష్టితోకాక, సమగ్ర సాంస్కృతికదృష్టితో అధ్యయనం చెయ్యాల్సి ఉంది.

## జానపద కథలు

గద్యకథలు ప్రపంచంలో ఎక్కువగా విద్వాంసులను ఆకర్షించాయి. ఎందుకంటే కట్టుకథలు, పురాణాలు, ఐతిహ్యాలు సామాజిక అధ్యయనానికి చాలా ఉపకరిస్తాయి. గద్య పురాణాలు, ఐతిహ్యాలు తెలుగులో విద్వాంసుల దృష్టిని ఆకర్షించలేదు. కాని వీటివల్ల తెలుగువారి నమ్మకాలు, సంప్రదాయాలు చక్కగా వ్యక్తమవుతాయి. సుమారు అరవై యేళ్ళక్రితం శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణశర్మ 'పినాకిని' అనే పత్రికలో కొన్ని ఐతిహ్యా లను 'గంగాభవాని-నరబలి' అనే పేరుతో ఇచ్చారు. (జానపదం సంపు. 3, సంచిక-1లో పునర్ముద్రితం). ఈ పండితుణ్ణి జానపద ఐతిహ్యాలు ఆకర్షించడం ఆశ్చర్యకరమూ, ముదావహమూ, వారిచ్చిన ఐతిహ్యాలిలా ఉన్నాయి :

1. అనంతపురము చెఱువు

ఇది విజయనగర బుక్కరాయుని కాలమున ననగా పదునాల్గవశతాబ్ద మధ్యమున గట్టఁడినది. ఈ తటాకమెన్నిమార్లు కట్టినను కట్టనిలువక తెగిపోవుచుండెనట !

గంగాభవాని యొకానొక స్త్రీదేహమున నావేశమై యొక గర్భిణియగు సుమంగలిని కట్టలో నిమిడ్చికట్టినచో నా కట్టనిలుచునని పలికెనట! బుక్కరాయ సముద్రగ్రామమున నుండి బసిరెడ్డియను నతని కడపటి కోడలు ముసలమ్మయను నామె పూర్ణగర్భవతిగ నుండి తానీ పనికి పూనుకొందునని తనవారినెల్ల సమ్మతిపఱచి గండిలో ప్రవేశించెను. ఆమెపై నాచోట కట్ట కట్టబడినది. నాటినుండి నేటిదాకా చెఱువు యథాస్థితిలో నున్నది. అచోట ములసమ్మ కట్టయను నరగున నేటికిని మునలిమ్మకు పూజలు జరుపుచున్నారు.

**2. ధర్మవరము చెఱువు**

ఈ చెఱువు 13 లేక 14వ శతాబ్దము నాటిది. దీనిని గూర్చియు నిట్టికథయే కలదు. ఈ తటాకము కట్టువేళ తొలుతనొక మండపము నిర్మించి యందు సకల వస్తు సామాగ్రి తోనొక తరుణినుంచి, యా మండపముపై కట్టకట్టిరట! ఆ సాధ్వి పేరు 'యీరచి దిమ్మమ్మ'. ఈమెనిపుడు తటాక దేవతగా పూజింతురు.

పై ఐతిహ్యాలవంటివి ప్రతిఊరికి సంబంధించినవి కోకొల్లలుగా ఉన్నాయి. ఒక్క ఊరిపేరుకే ఎన్నో వ్యాఖ్యానాలుంటాయి. ఉదాహరణకి నెల్లూరే తీసుకుందాం 'నెల్లు' అంటే వడ్లు. నెల్లూరిలో వడ్లు ఎక్కువగా పండుతాయని దీన్ని నెల్లూరు అని పిలుస్తారని సామాన్యంగా భావించడం జరుగుతున్నది. సంగకాల తమిళసాహిత్యంలో కూడా శాలియూరు అని నెల్లూరికి పేరుండినట్లుగా తెలుస్తున్నది. అయితే నెల్లి (ఉసిరిక) నుంచి నెల్లూరు పేరు వచ్చిందని ఒక పురాణంవల్ల తెలుస్తున్నది. ఇది శిష్టపురాణం కాదు, జానపద పురాణం. ముక్కంటిరెడ్డి అనేవాడు పరిపాలించే కాలంలో ఈశ్వరుడు ప్రత్యక్షమై ఉసిరిగ చెట్టుకింద శివలింగానికి ఆలయం కట్టించమని ఆదేశించాడట. ఆ మూలస్థానేశ్వరుడే నేటు మూలపేటలో ఉండే ఈశ్వరుడంటారు.

పురాణాల్లో, ఐతిహ్యాలలో, కట్టుకథలలో కనిపించే మంత్రతంత్రాలు, పుక్కిటికథాకల్పనలు, తలతోకలేని ఊహలు సామాజికంగా ఏం ఉపయోగిస్తాయి అని ప్రశ్నించవచ్చు. కాని అవి ఎందుకు, ఏ పరిస్థితుల్లో జానపదుని మస్తిష్కంలో రూపు దాల్చాయన్నవిషయాన్ని గాఢంగా పరిశీలింపవలసి ఉంది. జగత్తులో మనకు అర్థంకాని నిగూఢరహస్యాలెన్నో ఉన్నాయి. విజ్ఞానపూర్వయుగాలకు సంబంధించిన అనేక విషయాలకు అర్థమేమిటని ఈనాటికీ మనం తెలుసుకోలేక పోతున్నాం. మానవుని అంతరాంతరాల్లో ఉండే ఆశలు, ఆకాంక్షలు, నమ్మకాలు, మూఢవిశ్వాసాలు, భయాలు, సందేహాలు జానపద కథల్లో ప్రతిబింబిస్తాయి. నిద్రకు ఒక అర్థమంటూ ఉన్నదని మనోవిజ్ఞానులు చెప్తారు. అర్థంలేదనే మనం అనుమంటాం. అట్లే నిద్రలో మనంచూచే అద్భుత విషయాలవంటివే సమృద్ధిగా ఉండే కథలకుకూడా ఒక అర్థమంటూ ఉంది.

ఈ క్రింది కథ చూడటానికి కేవలం ఒక హాస్యకథగా కనిపిస్తుంది. అయినా అందులో ద్వంద్వప్రవృత్తిగల ఒక వ్యక్తి, తనకుతానుగా ఏ నిర్ణయమూ తీసుకోలేని

మూఢుడు పడే కష్టాలు ఎలావుంటాయనే ఆలోచనకు రూపకల్పన కనిపిస్తుంది వివేకం లేనివాడు తనుకోరినది లభించినా ఏవిధంగా దాన్ని అనుభవించలేకపోతాడో చక్కగా నిరూపిస్తుందీ చిన్నకథ (చెప్పింది వెంకటలక్షమ్మ, నారాయణరెడ్డిపేట, నెలూరు జిల్లా).

"ఒక బ్రాహ్మడు స్నానానికి పోయి నమస్కారంచేస్తే సూర్యుడు ప్రత్యక్షమై ఏంవరం కావాలన్నాడు. ఆ బ్రాహ్మడు భార్యను కనుక్కొని వస్తానన్నాడు. ఇంటికివచ్చి 'తలుపుదియ్యే' అన్నాడు. 'సూర్యుడు వరంకోరుకోమన్నాడు. 'ఏమడిగేది' అని భార్యను అడిగాడు 'ఒకటి అనుకుంటే రెండు కావాలి' అని వరం అడగమంది భార్య. సూర్యుణ్ణి అడిగి అట్లాంటి వరం తీసుకున్నాడు బ్రాహ్మడు.

ఇంటికి వచ్చిన బ్రాహ్మడు పెట్టెకుతాళంతీసి రూపాయలు తీసుకుని పప్పు, ఉప్పు కొని మూటకట్టుకొని, దట్టీగట్టి భుజాన పెట్టుకున్నాడు ఆ మూట రెండయింది మళ్ళీ భుజానపెట్టుకునేసరికి నాలుగుమూటలయ్యాయి. ఇట్లాచేస్తూపొయ్యాడు. ఎన్ని పెట్టుకున్నా రెండురెండయ్యాయి. బ్రాహ్మడు ఇంటికివచ్చి తలుపుదియ్యమన్నాడు. మూటలన్నీ దింపారు. 'నాకు దాహం' అన్నాడు మంచినీళ్ళు ఇచ్చింది భార్య అవీ రెండురెండయ్యాయి తొమ్మిది లోటాల నీళ్ళుతాగాడు. చివరికి పొట్టపగిలి చచ్చిపొయ్యాడు భార్య తపిస్తున్నది. పొద్దున నలుగురు మగవాళ్ళు బిచ్చానికి వచ్చారు. మొగుణ్ణి ఎత్తమన్నది ఆమె. వాళ్ళు సరేనని పీనుగను ఎత్తుకోబోయి తగలబెట్టి వచ్చారు. మళ్ళీవాళ్ళువచ్చేసరికి ఇంకో పీనుగ ఉంది. మళ్ళీ ఎత్తుకోబోయి చెరువులో పారేశారు. మళ్ళీ ఇంకొకటి తయారుగాఉంది. ఎంత మందిని చూపిస్తున్నావమ్మా' అంటే 'ఒక్కడే మొగుడయ్యా నాకు' అందామె. మళ్ళీ పీనుగను తీసుకుపోయి లోతుగా గుంటదవ్వి బాగాకూరిపూడ్చిపెట్టారు. మళ్ళీవచ్చేసరికి గుంటలోనుంచి లేచివస్తున్నాడా బ్రాహ్మడు. నలుగురూ ఆ బ్రాహ్మణ్ణి బాగాతన్ని తమ దారిన వెళ్ళిపోయారు."

చివరికి ఈ కథ ఏలా పరిష్కారమయిందోచెప్పిన నివేదకురాలికి తెలీదు. మనకూ తెలీదు ఇది తెగని సమస్య అన్నదిమాత్రం నేర్చుకోవలసిన నీతి. మనిషి ఆశకు అంతం లేనట్లే ఈ కథకూ అంతంలేదు.

భారతదేశం ప్రపంచంలోని అన్నిప్రాంతాల జానపదకథలకూ మూలమని భావించే పాశ్చాత్యవిద్వాంసులూ ఉన్నారు. వారిలో బెన్ఫె ముఖ్యుడు. పంచతంత్ర కథలకు ఆయన రాసిన ఉపోద్ఘాతంలో భారతమూల సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. వేలకొద్ది సంవత్సరాల నుంచి భారత మూలసిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. వేలకొద్దీ సంవత్సరాలనుంచి భారతా దృంతమూ కట్టుకథలు ప్రచారంలోవుండేవి. అవే పంచతంత్రంలోకి, హితోపదేశంలోకి ఇంకా అనేక కథాసంకలనాలలోకి ఎక్కాయి. జంతువులు పాత్రవహించే అనేక కథలు జానపదుల్లో ప్రచారంతో వున్నాయి. ఇవి తర్వాతికాలంలో నీతికథలుగా మారాయి. మరికొన్ని కథలు అద్భుతరసప్రధానాలై ఆబాలగోపాలమూ పరమోత్కంఠను కల్గిస్తూ తరతరాలుగా అలరిస్తున్నాయి.

ముఖ్యంగా కథల్లో మూలాంశాలు అధ్యయన యోగ్యమైనవి. కథను విశ్లేషించేటప్పుడు కనిపించే కనిష్టాంశాలివి. తలిదండ్రులు మూలాంశాలుకారు. కాని సవతితల్లి మూలాంశం. ఇట్లే బ్రహ్మరాక్షసుడు, మాయలపకీరు, యక్షులు, గంధర్వులు, మంత్రగత్తెలు మొదలయిన పాత్రలు మూలాంశాలు. జానపద కథల్లో ఈ మూలాంశాలవల్లనే ఆసక్తి కలుగుతుంది. వినాలనే కుతూహలం పెరుగుతుంది, మూలాంశాలలో మరోరకం వస్తువులు. జానపద కథలో అద్భుత వస్తువులనేకం వుంటాయి. అంజనం, మాయల అద్దం, మంత్రదండం, ఆకాశంలో ఎగిరేచాప, విభూతి, మంత్రజలం మొదలయినవి వస్తురూప మూలాంశాలు. అలాగే సప్తసముద్రాలు దాటడం, అనేక అవరోధాలను ఎదుర్కొని పంజరంలోని చిలుకలో ఉండే రాక్షస ప్రాణాన్ని తీయడం వట్టిసన్నివేశాలు మూలాంశాలే. ఇలా పాత్రలుగా, వస్తువులుగా, సన్నివేశాలుగా దర్శనమిచ్చే మూలాంశాలనుబట్టి కథల స్వరూపం బోధపడుతుంది.

## సా మె త లు

తెలుగుదేశం సామెతలకు పెద్ద ఖజానా. ఒక్కొక్క సామెతా అక్షరలక్షవిలువ కలది. నగరవాసులకు సామెతల అవసరం పెద్దగా లేకపోవచ్చుగాని, పల్లెప్రజలకు 'ఏదో సామెత చెప్పినట్లు' అని మాటలుప్రారంభించటం ఒక వాడుక. ఒక్కొక్క సామెతలో పరిపూర్ణ జీవితసత్యమే దాగిఉండవచ్చు. తెలుగుసామెతల్లో తెలుగువారి సంస్కృతిలో బహుముఖాలు ప్రదర్శితమవుతూ వుంటాయి.

కొన్ని సామెతలు దేశచరిత్రకు సంబంధించిన విషయాలను, కొన్ని స్థలాల వైశిష్ట్యాన్ని సూచ్యంగా తెలియజేస్తుంటాయి. 'తిరుపతి క్షౌరం' అనగానే తిరుపతిలో దేవుడిపేరిట జరిగే మోసాలన్నీ కళ్ళకుకట్టినట్లు కనిపిస్తాయి, కాశికిపోయినవాడూ కాటికి పోయినవాడూ ఒకటే' అన్నది ఒకప్పుడు రవాణా సౌకర్యాల లోపంవల్ల తీర్థయాత్ర ఎంతకష్టంతో కూడుకొని ఉండేదో తెలుపుతుంది.

అనుభవమే సామెతలుగా ఉద్భవించటానికి ముఖ్యకారణం. "ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖమెరుగదు" అన్నది నిత్యానుభవమే. "తిరిగేకాలు తిట్టేనోరు వూరుకోవు"అన్నదీ మనుషుల మనస్తత్వాలు తెలిసినవారు చెప్పినమాటే. "తీటగలవాడికి తోటగలవాడికి తీరిక వుండదు" అన్నది హాస్యస్ఫోరకం మాత్రమేకాక ఎంతో అనుభవంతో కూడిందని చెప్పక తప్పదు. "అరటిపండువలిచి చేతిలో పెట్టినట్లు"గా మాట్లాడారని ప్రశంసాత్మకంగా మాట్లాడటం మనకందరికి అలవాటే.

అనుభవంతోకూడిన సామెతలు ఎంతవరకు సత్యాన్ని చెప్తాయంటే ఒక్కొక్కసారి మనం అనుసరించే సంప్రదాయాలనే వెక్కిరిస్తాయి. "కోడికూయకపోతే తెల్లవారదా" అన్నది ఒకరకం సామెతయితే "అయ్యవారు లేకపోతే అమావాస్య ఆగిపోతుందా" అన్నది మరొకరకం సామెత. అయ్యవారిని పిలిచి తర్పణాలు చేయించుకొనేవారు కూడా ఒక్కొ-

సారి అయ్యవారు రాకున్నా అమావాస్యలు రావటం పోవటం అనుభవంద్వారా తెలుసుకుంటారు. 'అల్పుడికి ఐశ్వర్యంవస్తే అర్థరాత్రివేళ గొడుగుపట్టమన్నాడట' అనే సామెత అల్పులను గురించిన చక్కని వ్యాఖ్యానం నడమంత్రపు సిరినిగురించి ఇంతకన్నా బాగా చెప్పటానికి వీలుకాదు. 'అడగంది అమ్మయినా పెట్టదని అన్నట్లుగా సామెతల్ని తరచి చూస్తేగాని ఇలాంటి అనుభవాలు మనదృష్టికిరావు. 'అవు నలుపైతే పాలునలుపా' అని చెప్పడానికి పెద్ద అనుభవం అక్కరలేదు. అయితే ఇలాంటి సామెతల ఉద్దేశం కేవలం ఒక ప్రకృతిసిద్ధమైన సత్యాన్ని చెప్పడంకాదు, ఒక జీవితసత్యాన్ని నిరూపించడం. మనుషుల్లో నల్లవారుంటారు, తెల్లవారుంటారు. అనాకారులుంటారు, అందగాళ్ళుంటారు. అందం లేకున్నా గుణం మంచిదై వుండవచ్చు. ఇవన్నీ దృష్టిలో వుంచుకొనే 'ఆవునలుపైతే పాలు నలుపా' అన్న సామెతను జానపదులు సృష్టించారు.

సామెతల్లోని సామాజికసత్యాలను, సాహిత్యపరమైన సౌందర్యాన్ని, సాంస్కృతిక మౌల్యాలను వెలికితీసే సమీక్షలు వెలువడడం అవసరం. అర్థగాంభీర్యంగల సామెతలకు సాహిత్యరచనలుగా ఎంతో విలువవుంది. మితాక్షరాలతో అమితార్థాన్ని ఇచ్చేవి కాబట్టి ఇవిమాపే పరిణామం మహత్తరమైనది. శబ్దార్థాలు రెండింటి సౌందర్యమూ భాసించే కావ్య ఖండికలు సామెతలు.

'పడమట క్రుంకినపొద్దు తూర్పునతేవదా?

ఈ సామెతకు ఎంతయినా వ్యాఖ్యానం చేయవచ్చు. వాచ్యార్థమూ ఎంతో రమణీయంగా ఉంది. ప్రకృతిలో వెలుగునీడలు అనివార్యం, జీవితంలో సుఖదుఃఖాలు అత్యంత సహజం. ఈ లయ ఈవిధంగా సాగాల్సిందే. తూర్పున ఉదయించటం ముందుచెప్పి పడమట అస్తమించటాన్ని చెప్పివుంటే ఈ సామెతలో పెద్ద విశేషం లేకపోను. కాని తద్విరుద్ధంగా వుండటంవల్ల దీనికోవిశేషార్థం సిద్ధిస్తున్నది. సామాన్యమానవుడు మొదట జన్మను తర్వాత మరణాన్ని సహజక్రమంగా భావిస్తాడు. కాని జీవితానుభవాన్ని చవిచూచిన తాత్వికునికి మొదలుమరణం, తర్వాతజన్మ. దార్శనికులదృష్టిలో ఈజన్మ ఆత్మధరించే ఒక ఉడుపుమాత్రమే. అందువల్లనే చావుపుట్టుకలన్నారు, కష్టసుఖాలన్నారు. ఈ దినం కష్టం అనుభవించినా రేపు సుఖంలభిస్తుందనే ఆశే మనిషిని నిలబెడుతున్నది. మానవునికి సమాజమైన ఈ ఆశే, ఆశయమే పై సామెతలో ధ్వనిస్తున్నది. ఈ సామెత రమణీయార్థక ప్రతిపాదకమని వేరే చెప్పబనిలేదు.

చిక్కనైన మాటలలో సంస్కృతిని చక్కగా తెలియచేస్తాయి సామెతలు. ఇందుకు ప్రతి సామెతా ఒక ఉదాహరణే. సంఘంలోని కట్టుబాట్లు, ఆచారాలు, సంప్రదాయాలు సామెతలోని ప్రత్యక్షరంలో ప్రతిబింబిస్తుంటాయి.

ఒక ప్రాంతానికి సంబంధించిన సంస్కృతిని తెలుసుకోవాలంటే వివాహసంబంధాలు, కుటుంబంలోని వివిధ బాంధవ్యాలు, అలవాట్లు, అభిరుచులు తెలుసుకోవాలి. మనది పితృ

ప్రధానకుటుంబం. అత్తవారింటికి వచ్చిన స్త్రీ అక్కడ ఏవిధంగా నడుచుకుంటుంది అనే దానిమీద కుటుంబంలో సుఖశాంతులు ఆధారపడివుంటాయి. ఈ సంబంధబాంధవ్యాలను సూచించే సామెతలు అసంఖ్యాకంగా ఉన్నాయి.

"ఇల్లులేనమ్మ ఈనం చెడె, మొగుడులేనమ్మ మానంచెడె"
"బెత్తిలిదానా బట్టకట్టంటె రెండుకాళ్ళెత్తి నెత్తినేసె"
"సంతలోని దాన్ని నమ్ముకొని ఇంట్లోని ఆలిని అమ్మఅన్నట్లు"
"కన్నతల్లి కడుపుకన్నం పెట్టనివాడు పిన్నతల్లికి పిండప్రదానంచేస్తాడా?
"అత్తకాలం కొన్నాళ్ళు – కోడలికాలం కొన్నాళ్ళు"

వీటికి తలమానికమనదగింది 'అత్తవారింటి సుఖం మోచేతి దెబ్బ' అన్నది. ఇది ఈ కాలపు నాగరికులకు అన్వయించకున్నా మన తరతరాల సంస్కృతిలోని లోపాన్ని ఎత్తిచూపుతుంది. దెబ్బ తెలియనివారికి మోచేతిదెబ్బ ఎలాంటిదో తెలియదు 'అదేం బాధ కలిగిస్తుంది' అని చెప్పేవారు మోచేతిదెబ్బను చవిచూస్తే అర్థమవుతుంది. చాలా సరళమైన గంభీరమైన ఉపమానం పై సామెతలో ఉంది.

మన సంప్రదాయాల సుడిలోచిక్కి చితికిపోయే సంసారాలుకూడా అనేకం ఉన్నాయి. 'పెళ్ళిచేసిచూడ'మన్నారు జానపదులు. కట్నాల భారంమోయలేక, కన్న కూతురి పెళ్ళిచేయలేక కుమిలే బీదాబిక్కి ఇంకా మనదేశంలో లక్షలసంఖ్యలో ఉన్నారు, 'పెళ్ళి అయిన ఇంట్లో ఆరునెలలు కరువు' అన్న సామెత ఇలాంటి దయనీయ పరిస్థితిని శక్తివంతంగా తెలియజేస్తుంది. పెళ్ళిచేయడమే మితిమీరిన కష్టమైపోతుంటే బంధువులకు మాత్రం తక్కువలేదు. శక్తికిమించిన కష్టాన్ని నెత్తినవేసుకున్నవారు బాధలుఅనుభవించక తప్పదు. ఒక్కొక్కసారి 'పెళ్ళికిచేసిన పప్పు, పేరంటాండ్రు చవిచూడను సరిపోయింది' అని వచ్చిన నలుగురూ దెప్పిపొడుస్తున్నా వూరకతలవంచుకోవలసిన పరిస్థితిఏర్పడుతుంది.

సామెతల్లో కనిపించే వైవిధ్యం అనంతమయింది. అవి ప్రతిపాదించే విషయాలకు లెక్కలేదు 'ఆపదలో ఆదుకున్నవాడే చుట్టం' అనేమాటనుకాదనే వారెవరుంటారు ? 'మింగ మెతుకుతేదు మీసాలకు సంపెంగ నూనె' అన్నది శక్తికిమీరిన ప్రదర్శన జరిపే వాళ్ళను వ్యంగ్యంగా మందలిస్తున్నది. 'తాతకు దగ్గులు నేర్పకు' అన్నది వయస్సువల్ల వచ్చిన అనుభవాన్ని కాలదన్నరాదనే విషయాన్ని ఒత్తిపల్కుతున్నది 'అవ్వాకావాలి బువ్వాకావాలి' మనుషుల మనస్తత్వం ఏలాంటిదని అత్యంత సరళంగా ఆవిష్కరిస్తున్నది. చిన్నపని చేయలేనివాళ్ళు మహత్కార్యాలను సాధించలేరు. ఇలాంటివాళ్ళను గురించి చెప్పాలంటే 'ఉట్టికి ఎక్కలేనమ్మ స్వర్గానికి వెళ్తుందా' అనే సామెత చక్కగాసరిపోతుంది. 'తిన్నింటి వాసాలు లెక్కపెట్టినట్లు' అనిచెప్తే ద్రోహబుద్ధి కలవారికి అంతకంటే వేరే చురక అంటించనక్కరలేదు 'గోటితో పోయేదానికి గొడ్డలెందుకు' అన్న సామెతను చెప్పిన జానపదుడికి జీవితంలో ఎన్ని అనుభవాలు కలిగాయో ఎవరు చెప్పగలరు !

జీవితంలో ఏదో ఒక సందర్భంలో సామెతల్ని వాడనివారంటూ ఎవ్వరూ వుండరు. "ప్రజలు ఎలా వుంటారో సామెతలలా వుంటాయి" అని ఒక స్కాటిష్ సామెత చెప్తున్నది. మొత్తంమీద "సామెతలేని మాట ఆమెతలేని ఇల్లు" అనటంలో ఎంతో సత్యం వుంది.

## పొడుపు కథలు

వినోదాన్ని విజ్ఞానాన్ని సమపాళ్ళలో ఇచ్చే పొడుపుకథ జానపదుడి బుద్ధికుశలతకు నిదర్శనం. "జీవితంలో మనం ఎదుర్కొనే సమస్యలకు ఏ విధంగా పరిష్కారం కనుక్కోవలెనా" అని ఆలోచించిన మనిషే పొడుపు కథలను సృష్టించాడు. సమస్యను మనంగా పరిష్కరించుకోవడం ఒక మార్గమయితే, ఇతరుల్ని సమస్యలో ఇరికించి తమాషా చూడడం మరో మార్గం ప్రశ్న మనం వేసి, జవాబును మరొకరినుంచి రాబట్టుకోడానికి ప్రయత్నించటం పొడుపు కథలో ముఖ్యంగా కనిపిస్తుంది.

తెలుగులో పొడుపు కథలకు కొదువలేదు, 'పొడుచుట, విప్పుటలో ఆనందమును వెల్లివిరియించునవి పొడుపు కథలు'' అని నేదునూరి గంగాధరం గారొకచోట అన్నారు. సమస్యాత్మక కథలకే మొదట పొడుపుకథలనే పేరుండి తర్వాత అన్ని పొడుపులకూ పొడుపుకథ అనే పేరు వచ్చివుంటుంది.

తెలంగాణాలో కొన్నిచోట్ల వీటిని 'శాస్త్రం' అంటారు. రామరాజుగారు 'తెలుగు జానపదగేయ సాహిత్యములో (పు, 519) శాస్త్రార్థమెంత కఠినమో దీనిని విడదీయుట యంత కష్టమని కాబోలు పొడుపు కథలకు శాస్త్రములని పేరువచ్చినది' అన్నారు. మొత్తంమీద పేరు ఏమైనా పొడుపుకథలు నిజమైన అర్థాన్ని కప్పిపుచ్చుతాయి. జవాబును నేరుగా సూచించవు. వినేవాళ్ళను అవి తికమక పెడ్తాయి.

ప్రాచీనకాలంనుంచి సాహిత్యంలో అనేక పొడుపు కథలు చోటు సంపాదించుకున్నాయి. అన్నిటికంటే ప్రసిద్ధమైన ఉదాహరణ యక్షప్రశ్నలది. ఎర్రన మహా భారతాంధ్రీకరణంలో కొన్ని యక్షప్రశ్నలిలా వున్నాయి.

మొనసి నిద్రించియును కన్నుమూయని దెద్ది
పుట్టియును చేతనత్వంబు పొరయదెద్ది
యరయ రూపుగల్గియు హృదయంబులేని
దెద్ది ? వేగంబు కతమున నెద్దిపొలుచు.

ధర్మజుని ప్రత్యుత్తరం :

అనిన కన్నుమూయదు సుప్తమయ్యు మీను
పుట్టియును గ్రుడ్డు చేతనం బొరయకుండు

హృదయరహితంబు రారూపమేఊ రయము
కతన వర్తించుననని చెప్పె కౌరవుండు.

ఇలాంటి పొడుపులు సాహిత్యంలో అక్కడక్కడా దర్శనమిస్తాయి.

జానపదుల పొడుపు కథలో శబ్దాలవల్ల కనుక్కోవలసినవి, అర్థంవల్ల తెలుసుకోవలసినవి. ఆలోచించి చెప్పాల్సినవి, వివేకంతో విశ్లేషించవలసినవి ఎన్నో వున్నాయి.

| | | |
|---|---|---|
| వంకరటింకర | శొ | (శొంఠి) |
| వానితమ్ముడు | అ | (అల్లం) |
| నల్లగుడ్ల | మి | (మిరియం) |
| నాలగుకాళ్ళ | మే | (మేక) |

ఇవన్నీ శబ్దంలోని చమత్కారంవల్ల తెలుసుకోదగినవి. అయినా పై పొడుపుకథలో ఒక తమాషా వుంది. దానిలోని మూడువస్తువులు ఆహారపదార్థాలు. ఇవన్నీ వరసగా చెప్పుకుపోవచ్చు. నాలుగవది జంతువు. ఈ విధంగా మూడు ఒకవిధంగా చెప్పి నాల్గవదాన్ని మార్చివేయడంలో ఈ పొడుపు కథను కల్పించినవాని శిల్పం గోచరిస్తుంది. వినేవాడిని తప్పుదారిని పట్టించాలనే అభిప్రాయం ఒకటి, ఇలాంటి శబ్ద చమత్కారాలను ఏలాగైనా వాడుకోవచ్చునని తెలియజెప్పడం మరొకటి ఈ పొడుపుకథ ఉద్దేశాలు.

కొన్ని పొడుపుకథల్లో శబ్దాలు, వాటి పొందిక, వాటి వాచ్యార్థమూ పరమ రమణీయంగా ఉంటాయి.

'గుడినిండ ముత్యాలు గుడికి బీగం'

ఈ పొడుపుకథ ఎంతచక్కగావుంది! గుడినిండా ముత్యాలు ఉంచి బీగంవేయటం గుడి పవిత్రతను తెలుపుతుంది ముత్యాల నన్నిటినీపెట్టి బీగం వేసేస్తె దాన్ని వాడుకోటం ఎలాగా అనే సందేహమూ కలుగుతుంది. ఇవన్నీ ఒకవిధమైన కల్పనాలోకానికి శ్రోతను తీసికెళ్తాయి, చివరకి అనికి అర్థం గోచరిస్తుంది. ఈ పొడుపుకథకు అర్థం దానిమ్మపండు.

కొన్ని పొడుపుకథలు వర్ణనాత్మకంగా ఉంటాయి. ప్రకృతి వస్తువులను ఈ సమస్యల్లోనే తనివితీరా వర్ణించి జానపదులు తమవర్ణనపటిమను ప్రదర్శిస్తారు.

నూతిలో పాము, నున్నటి పాము
పొడలపొడల పాము, పొట్టిపొడుగుపాము,
వాడవాడలపాము, వాలైనపాము,
చారాచారలపాము, చక్కనిపాము,
పామునిపట్టి కూరచేస్తె
పంటికిందికేరాదు (పొట్లకాయ)

ఈ పొడుపుకథలో పొట్లకాయను చక్కగా వర్ణించి భౌతికగుణాన్నే తెలపడం మాత్రమే కాకుండా దాన్ని కూరగా చేస్తే పంటికికూడా చాలదని ఆహారగుణాన్నికూడా చక్కగా అనుభవాన్ని రంగరించి చెప్పాడు జానపదుడు.

కొన్ని పొడుపుకథలు పైకి అశ్లీలంగా కనిపించినా అర్థంమాత్రం చక్కనిదై వుంటుంది. ఇది జానపదుల అమాయక మనస్తత్వాన్ని తెలిపేగుణం.

ఊరుకున్నదేదయా ? ఊగులాడేదేదయా
కాళ్ళసందుదేదయా ? కమ్ముకొచ్చేదేదయా

అన్నది ప్రశ్న. ఇది వినగానే ఎవరికైనా అశ్లీలార్థం స్ఫురిస్తుంది.

జవాబు :

ఊరకున్నదావయా. ఊగులాడేది దూడయా
కాళ్ళసందుది ముంతయా, కమ్ముకొచ్చేవి పాలయా,

జవాబు తెలిసినతర్వాత పొడుపులోని పదాలు ఎంతసార్థకమైనవో తెలుస్తుంది.

ప్రకృతిలోని వస్తువులు పొడుపు కథల్లో చాలావరకు చోటు చేసుకుంటాయి. దీనికి కారణం మానవుడు ప్రకృత్యారాధకుడు కావటమే. పొడుపుకథల ఉత్పత్తికి ప్రకృతి ఉపాసకుడైన మానవుని మనస్సుకి సంబంధముందని విద్వాంసులంటారు. కొన్ని పొడుపు కథల్లో అద్భుతవర్ణనలు కనిపిస్తాయి. కొబ్బరికాయనుగూర్చిన పొడుపుకథ చక్కనిది.

చక్కని స్తంభం
చెయ్యని గుండి
పొయ్యని నీరు
వెయ్యని సున్నం.

కొన్ని పొడుపుకథల్లో అత్యంత రమణీయమైన పదచిత్రాలు దర్శనమిస్తాయి. అలాంటి వాటిల్లో కొబ్బరిచెట్టును గూర్చినది తలమానికం.

ఒంటి స్తంభం మేడపైన
ఒప్పగు చలిపందిరి
చలువ నీటి కుండల్లో
చవులూరే మీగడ.

ఇవన్నీ చూస్తే పొడుపుకథలు కేవలం కాలక్షేపానికి ఏర్పడినవికావని స్పష్టమవు తుంది. జానపదుల బుద్ధివికాసానికి ఇవి బాగా తోడ్పడతాయి. వానకోసం, పెళ్ళిళ్ళలో, వినోదంకోసం, బాగా పంటపండటం కోసంకూడా పొడుపుకథలను వాడడంకద్దు. కొన్ని చోట్ల, కొన్ని సందర్భాలలో పొడుపుకథలను వాడరాదనే నిషేధం కూడా వుంది. నాట్లు, కోతల సమయంలో వీటివాడకం పనికిరాదంటారు. పనివేళలో వీటినివాడితే సరిగాపని జరగదని భావంకావచ్చు.

కొన్ని మనోహరమైన పొడుపుకథలు ఈక్రిందివి :

1. అమ్మా పెంచితివి, పెద్దవానిని చేసితివి, నువ్వుంమకున్నాసరే, వారికిచ్చినాసరే, తెల్లవారితేపనికిరాను. — మల్లెపువ్వు
2. అరచేతి పట్నానికి అరవై వాకిండ్లు — దువ్వెన
3. నల్లని చెర్లో ఎర్రని తామర — దీపం
4. పుట్టెడు రాగులకు ఒకటేరాయి — చంద్రుడు
5. ఎక్కాదిగతేని మాను ఏటాగంపెడు కాయలుకాస్తుంది — మిరపచెట్టు
6. బావిలో సీతమ్మ మునిగిమునిగి లేచె — వెన్నముద్ద

పొడిస్తే మామూలుగా నొప్పికలుగుతుంది. కాని పొడుపుకథలపొడుపు గిలిగింతలు పెడుతుంది. ఆలోచనల్ని రేకెత్తిస్తుంది. బుద్ధివికాసంచెందేటట్లుచేస్తుంది. వినోదాల్నిస్తుంది జానపదులపాలిటి ఉపనిషత్తు, గణితం, బుద్ధికసరత్తు, వినోదసాధనం, విజ్ఞానం పొడుపుకథే.

## దేశ విదేశాల్లో జానపద సాహిత్యాధ్యయనం

జానపద విజ్ఞానానికి మూలపదమైన 'Folklore' ను 1846లో డబ్ల్యు. జే. థామ్స్ అనే విద్యాంసుడు రూపొందించాడు. జానపదులకు చెందిన ఆచారాలు, నమ్మకాలు, కథాగేయాలు, సామెతలు, మొదలైన విజ్ఞానమే 'ఫోక్‌లోర్' అని థామ్స్ రచించాడు. పంతొమ్మిదో శతాబ్దిలో ప్రారంభమైన జానపద విజ్ఞాన అధ్యయనం నేడు ప్రపంచంలోని పలుప్రాంతాలలో అత్యంత శాస్త్రీయంగా, ఆధునికంగా సాగుతున్నది.

జానపద సాహిత్యాన్నిగూర్చిన ఆసక్తి, దాన్ని విశ్వవిద్యాలయాలలో శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యాలనే దీక్ష తెలుగుదేశంలో ఇటీవలనే పెరిగినా, మనకీసాహిత్యం కొత్తదేమీకాదు. 18వ శతాబ్ది చివరిభాగంలో కల్నల్ మెకంజీ ప్రారంభించిన పురావస్తు

పరిశోధన ఈ సందర్భంలో పేర్కొనదగింది. జానపద సంస్కృతిని అధ్యయనం చెయ్య డానికి మెకంజీ సేకరణలు ఎంతగానో ఉపకరిస్తాయి.

సి. పి. బ్రౌన్ సేవనుకూడా ఈ సందర్భంలో స్మరించుకోవాలి. బ్రౌన్ లేఖలతో సహా ఆయన సేకరణలు ఆంధ్రుల జీవితంలోని బహురూపాలను పరిచయం చేస్తాయి, పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలికథ, కుమారరామునికథవంటి అనేక కథాగేయాలను బ్రౌన్ సేకరించాడు. జె ఎ. బోయల్ ఇండియన్ ఆంటిక్వేరీలో ఒక చారిత్రక గేయాన్ని, కొన్ని శృంగార గేయాలను ప్రచురించి విద్వాంసుల దృష్టిని ఆకర్షించాడు.

తెలుగులో వెలువడిన చెప్పుకోదగ్గ జానపద గేయ సంకలనాలలో నందిరాజు చల పతిరావుగారు వెలువరించినవి ఉన్నాయి (1900, 1903). 20వ శతాబ్ది పూర్వార్ధంలో మంగు వెంకట రంగనాథరావు, టేకుమళ్ళ అచ్యుతరావు మొదలైనవారు కొన్ని సంకలనాలను ప్రచురించారు. ఈ శతాబ్ది ఉత్తరార్థంనుంచి మాత్రమే జానపద సాహిత్యాన్ని గూర్చిన కృషి విమర్శనాత్మకంగా సాగుతున్నది. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, అక్కిరాజు ఉమాకాన్తంగారు చేసిన సేవ గమనార్హం.

సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్రలో జానపద విజ్ఞానానికి సంబంధించిన సమాచారం బోలెడంత దొరుకుతుంది. జానపద విజ్ఞానాన్ని ఎక్కువ మొత్తంలో సేకరించి దానికోసం తమ జీవితాన్నే అంకితం చేసిన మహనీయులు నేదునూరి గంగాధరంగారు 'మిన్నేరు', మున్నీరు, సెలయేరు, మొదలైన సంకలనాలతో బాటు సామెతలు ఆటపాటలు, పండుగలు, కథలు మొదలైన వివిధ ప్రక్రియలను సేకరించి ప్రచురించారు గంగాధరంగారు. శ్రీహరి ఆదిశేషువుగారి జానపద గేయ వాఙ్మయ పరిచయము, 1954లో తెలుగు భాషా సమితి బహుమతి అందుకుంది. ఆంధ్రసారస్వత పరిషత్తు ద్వారా 'కృష్ణశ్రీ'గారు ప్రచురించిన గేయ సాహిత్య సంకలనాలు చాలా విలువకలవి,

జానపదసాహిత్యాన్ని విశ్వవిద్యాలయం మెట్లెక్కించిన వారు డా బి రామరాజుగారు. తెలుగు జానపద గేయసాహిత్యమునకు, పిహెచ్. డి పట్టం పొందడమే కాక వేల సంఖ్యలో గేయాలను, కథాగేయాలను సేకరించారాయన, Folklore of Andhra Pradesh, Folktales of Andhra Pradesh, మొదలైన గ్రంథాలను, పెక్కు వ్యాసాలను ప్రచురించారు. డా. టి దొణప్పగారు రాయలసీమకు చెందిన జానపద విజ్ఞానాన్ని వెలుగులోకి తేవడమేకాక అపూర్వమైన పరిశోధన విషయాలను తమ వ్యాసాలలో తెలిపారు,

ఇటీవల కాలములో అనేక విశ్వవిద్యాలయాలలో జానపద విజ్ఞానాన్ని గురించి కృషి జరుగుతున్నది వీటిలో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని మొదట చెప్పుకోవాలి. మైసూరు బెంగుళూరువంటి రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా తెలుగు జానపద సాహిత్యాన్ని గురించి పరిశోధన జరుగుతున్నది. కొన్నిచోట్ల తులనాత్మక పరిశీలన కూడా జరుగుతున్నది (ఈ పుస్తకరచయిత తెలుగు-కన్నడ జానపదగేయాల తులనాత్మక పరిశీలనకు మైసూరు విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి పట్టం పొందాడు). డా. నాయని కృష్ణకుమారి, డా. యెల్దండ రఘుమారెడ్డి, డా. జి. లింగారెడ్డి, డా. సుందరం రాసిన సిద్ధాంత గ్రంథాలు ప్రచురితాలయ్యాయి. అనేక విశ్వవిద్యాలయాలు ఎం. ఎ తరగతుల్లో జానపద సాహిత్యాన్ని ఒక అధ్యయన విషయంగా ప్రవేశపెట్టాయి. ఇవన్నీ మన రాష్ట్రంలో జానపద సాహిత్యాధ్యయనానికి మంచికాలం రాబోతున్నదనడానికి నిదర్శనాలు.

మనదేశంలో కొన్నిచోట్ల జానపదసాహిత్యం గణనీయంగా అధ్యయనం చెయ్యబడుతున్నది. ముఖ్యంగా కర్నాటకరాష్ట్రంలో శాస్త్రీయదృష్టితో జరుగుతున్నకృషిని పేర్కొనవలసి ఉంది. మైసూరు విశ్వవిద్యాలయంలో జానపద విజ్ఞానంలోనే ఎం.ఎ, డిప్లమా తరగతులున్నాయి. జానపదవిజ్ఞాన వస్తుప్రదర్శనశాలఉంది కర్నాటకలో జానపదవిజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు సుమారు వెయ్యిప్రచురింపబడ్డాయి. తమిళనాడు. బెంగాల్, గుజరాతు వంటిచోట్ల కూడా కొంతమంది విద్వాంసులు విశేషమైన కృషి చేస్తున్నారు.

విదేశాల్లో జరిగిన, జరుగుతున్న కృషినికూడా కొంత తెలుసుకోవాలి. పంతొమ్మిదో శతాబ్ది చివరిభాగంలోనే ఐరాపాలో, అమెరికాలో, జానపదవిజ్ఞాన కేంద్రాలు స్థాపించబడ్డాయి. ఫిన్‌లాండ్, ఇంగ్లాండ్, స్కాట్లెండ్ మొదలైనచోట్ల కథాగేయాలు, సామెతలు, ఐతిహ్యాలు మొదలైన ప్రక్రియలను గురించి పరిశోధనాసక్తి పెరిగింది.

20వ శతాబ్దిలో విదేశీయులు జానపద విజ్ఞానాన్ని ఒక శాస్త్రీయాధ్యయన విష తీర్చిదిద్దారు. మేరియా లీచ్ సంపాదకత్వంలో వెలువడిన Standard Dictionary of Folklore, Mythology and Legeand ఒక మహత్తర సాధన. స్టిత్ థామ్సన్ జానపద కథను విశ్లేషించి, వివరించి ఒక పరిశోధన గ్రంధాన్ని వెలువరించారు. మూలాంశాల సూచిని ప్రచురించి థామ్సన్ మహోపకారం చేశారు. ఆంటి ఆర్నె ప్రచురించిన కథావర్గ సూచిని కూడా పరిష్కరించి ప్రచురించడంలో థామ్సన్ తోడ్పడ్డారు. ప్రాప్, గమరీ, ఎడ్వర్డ్ లీచ్, డార్సన్, అలన్ డండెస్, మరండా, టైలర్, గ్రాప్స మొదలైనవారు జానపదవిజ్ఞానానికి చేసిన సేవ గమనించదగ్గది.

నేడు జానపదసాహిత్యాన్ని కేవలం సాహిత్యదృష్టితో అధ్యయనంచేస్తే చాలదు. ఇది సాంస్కృతికంగా ఎంత విలువైనదో విద్వాంసులు గుర్తించారు. అందువల్ల ఇదొక అన్వయిక విజ్ఞానంగా రూపొందుతున్నది. మానవశాస్త్రం, పురాఅస్తుశాస్త్రం, చరిత్ర, సామాజికశాస్త్రం, వైద్యం, మనోవిజ్ఞానం, జీవశాస్త్రంవంటి అనేక అధ్యయన విషయాల సహాయంతో జానపదసాహిత్యాన్ని పరిశీలించాల్సి ఉంది. ఎందుకంటే ఈ సాహిత్యం సామాన్యజనుల జీవితాన్ని, సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. కంప్యూటరువంటి అత్యాధునిక పరికరాల సహాయంకూడా తీసుకొని జానపదసాహిత్యాన్ని వివరణాత్మకంగా, చారిత్రకంగా తులనాత్మకంగా పరిశీలిచినపుడే ఈ సాహిత్యానికుండే అసలువిలువ ఏమిటన్నది బోధ పడుతుంది. ఆంధ్రులకూ ఒకే ప్రత్యేక సంస్కృతి ఉన్నదని లోకానికి చాటిచెప్పాలంటే మనం స్వీకరించవలసింది జానపద సాహిత్యాన్నే అంటే తప్పులేదు.



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య